శ్రీరస్తు.

శ్రీమచ్చతుష్షష్టికళాత్మకాలంకారసార్వభౌమబిరుదాఙ్కితైః

శ్రీ గుఱ్ఱం వేంకన్నశాస్త్రిభిః

విరచితమ్

# వాదప్రహసనమ్

శ్రీ సి. వి. రఙ్గనాథశాస్త్రిప్రేరిత శ్రీచదలవాడ అనన్తరామశాస్త్రికృత
యువతీవివాహసాధకవివాహ్యకన్యాస్వరూపనిరూపణాఖ్య

గ్రన్థఖణ్డనాత్మకం సిద్ధాన్త సిద్ధాఞ్జనాఖ్యం చ,

అఙ్గోరువాసినా వేదము సుబ్రహ్మణ్యశర్మణా ఆంధ్రీకృతమ్.



చెన్నపుర్యామ్:

వావిళ్లాఖ్య ముద్రాక్షరశాలాయాం ముద్రితమ్.

 1952 [Rs. 1—0—0

# సంస్కృతగ్రంథములు

## ఇతిహాసపురాణములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| బాలరామాయణము, పెద్దచ్చు ... | 0 | 2 |
| బాలరామాయణము, సటీక ... | 0 | 4 |
| శ్రీమద్వాల్మీకిరామాయణము, మూలము ... | 8 | 0 |
| ,, సుందరకాండము, మూలము ... | 2 | 0 |
| ,, ఉత్తరకాండము, రఫ్ ప్రతి ... | 2 | 0 |
| శ్రీమద్రామాయణము, ఆంధ్రతాత్పర్యము— | | |
| ,, సుందరకాండము ... | 5 | 0 |
| తక్కినకాండలు అచ్చుకానున్నవి | | |
| కార్తికమాహాత్మ్యము (స్కాందము) ఆంధ్రతాత్పర్యసహితము ... | 1 | 8 |
| కాశీమాహాత్మ్యము, తెనుగువచనము ... | 1 | 0 |
| గయామాహాత్మ్యము, తెనుగువచనము ... | 0 | 10 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము ... | 2 | 8 |
| భవిష్యపురాణము-బ్రాహ్మపర్వము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 6 | 0 |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము, తెనుగువచనము ... | 0 | 8 |
| జగన్నాథమాహాత్మ్యము, తెనుగువచనము ... | 0 | 4 |
| ధనుర్మాసమాహాత్మ్యము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, సాంధ్రతాత్పర్యము ... | 3 | 0 |
| శ్రీమహాభారతము, గచ్ఛద్వ్యాఖ్యానసహితము, 3 సంపుటములు ... | 40 | 0 |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యానసహితము, 2 సంపుటములు ... | 20 | 0 |
| శ్రీమద్దేవీభాగవతము, సవ్యాఖ్యానము ... | 15 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము ... | 5 | 0 |
| ఛాందోగ్యోపనిషద్భాష్యమ్, ఆనందగిరిటీకాసహిత శ్రీశంకరభాష్యేణ విశిష్టాద్వైతభాష్యేణ చ సంయోజితమ్, సంస్కృతమ్ ... | 12 | 0 |
| తైత్తిరీయోపనిషద్భాష్యమ్, (సంస్కృతము) ... | 3 | 8 |
| బృహదారణ్యకోపనిషత్ భాష్యమ్ (సంస్కృతము) ... | 12 | 0 |

## వైదికగ్రంథములు

| | రూ. | అ. |
|---|---|---|
| అమావాస్యాతర్పణము ... | 0 | 2 |
| అభిశ్రవణమ్ ... | 0 | 8 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు ... | 0 | 3 |
| ఆపస్తంబప్రవరకాండము ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండము ... | 0 | 3 |

శ్రీ ర స్తు.

శ్రీమచ్చతుష్షష్టికళాత్మకాలంకారపార్శ్వభామబిరుదాఙ్కితైః

శ్రీ గుఙ్జుం వేంకస్నశాస్త్రిభిః

విరచితమ్

# వాదప్రహసనమ్

శ్రీసి. వి. రఙ్గనాథశాస్త్రిప్రేరిత శ్రీచదలవాడ అనన్తరామశాస్త్రికృత

యువతీవివాహసాధకవివాహ్యకన్యాస్వరూపనిరూపణాఖ్య

గ్రన్థఖణ్డనాత్మకం సిద్ధాన్త సిద్ధాఞ్జనాఖ్యం చ,

అల్లూరువాసినా వేదము సుబ్రహ్మణ్యశర్మణా ఆన్ధ్రీకృతమ్.



చెన్నపుర్యామ్:

వావిళ్లాఖ్య ముద్రాక్షరశాలాయాం ముద్రితమ్.

1952

PRINTED BY
V. VENKATESWARA SASTRULU
OF V. RAMASWAMY SASTRULU & SONS
AT THE VAVILLA PRESS
Madras —1952.

పండిపెద్ది కృష్ణస్వామయ్య, సభాపతి, వెలనాటి శాఖాధిపతి.

కోడూరు సీతారామయ్య, మురికినాటి శాఖాధిపతి.

అమరవాది పద్మనాభయ్య, తెలంగాణ్య శాఖాధిపతి.

వసంతపురం సుబ్బరాయుఁడు, కరణకమ్మ శాఖాధిపతి.

వీరభాగవతుల సుబ్రహ్మణ్యశాస్త్రులు, ప్రథమశాఖ శాఖాధిపతి.

తి. అప్పయ్యదీక్షితులు, వ. ఉపాధ్యాయ్యరి, ద్రావిడశాఖాధిపతులు.

శ్రీః

శ్రీ కాంచీ కామకోటిపీఠాధీశ్వర జగద్గురు సార్వభౌమ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యాధిష్ఠానమునందు సింహాసనాభిషిక్తులయిన శ్రీ మన్మహాదేవేంద్ర సరస్వతీ శ్రీపాదులవారి శిష్యకోటి ప్రవిష్టులును శ్రీమచ్చతుష్షష్టికళాత్మకాలంకారసార్వభౌమబిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ గుత్తిం వెంకన్నశాస్త్రులవారి సమ్ముఖమ్మునకు:

అయ్యా! ఈ అడుగున చేవ్రాలుచేసిన చెన్నపట్టణస్థితాశేషవిద్వన్మహాసభవారు వినయపూర్వకముగా తెలియపరచుకొనునది యేమనగా—

కలియుగశకాబ్దాః ౪౯౬౬ కి సరియైన గడచిన క్రోధననామసంవత్సరాషాఢ కృష్ణాష్టమీ భానువాసరంబున శ్రీ చదలవాడ అనంతరామశాస్త్రులవారిచే విరచితంబై, శ్రీవారియాస్థానంబునందు సమర్పింపబడిన యువతీ వివాహసాధకంబగు వివాహ్యాకన్యాస్వరూపనిరూపణం బను గ్రంథమును ఖండించి, అనేకపండితులచేత శ్రీవారి యాస్థానంబున సమర్పింపబడిన ఖండనగ్రంథములలో ప్రతియుక్తఖండకంబయి ప్రతివాదిచేత అంగీకరింపబడిన మనుస్మృతి మూలకమైనందున మీచే విరచితంబైన సిద్ధాంతసిద్ధాంజన మను గ్రంథంబునే పై యనంతరామశాస్త్రుల గ్రంథంబునకు పూర్ణమైన ఖండనగా గ్రహించి క్రోధననామసంవత్సర మార్గశిర బహుళ ౧౧ లు బుధవాసరంబున ఉభయవాదుల యెదుట శ్రుతి స్మృత్యాచారంబున కవిరుద్ధంబై వాచనికప్రమాణయుతమై యుండుట చేతనున్ను, అపార్థకల్పనావిరహితంబై సయుక్తికంబై యుండుటచేతనున్ను, సిద్ధాంతసిద్ధాంజనం బను మీ గ్రంథమును సిద్ధాంతపరచితి మని తీర్పు సెలవిచ్చి క్రోధననామసంవత్సర పుష్య శుద్ధ ౪ గురువాసరంబున స్వముద్రాముద్రిత సిద్ధాంతపత్రికాదానాదులచే మిమ్ము గౌరవించినదిమాత్రమేగాక జయనిదర్శనంబును విద్వన్ముఖ్యచిహ్నంబును నగు సువర్ణకలశశోభితచ్ఛత్రముచే మిమ్ము ఈ మహాసభవారు గౌరవించుట తమకు మిక్కిలి ఆనందజనకం బని సెలవిచ్చిన శ్రీవారి యాజ్ఞ చొప్పుననున్ను, మీవంశపరంపరాగత వైదుష్యమున కనుగుణంబుగ మీ సర్వతోముఖపాండిత్యముచేత ఈ సభవారికి కలిగిన సంతోషాధిక్యతచేతనున్ను మీ కీ సభవారు బిరుదుగా ఇప్పించిన స్వర్ణశిఖరశోభితచ్ఛత్రంబును నంగీకరింప మిమ్ము గోరుటయేగాక యీలాటిపాండిత్యముగలిగి దుర్వాదఖండకులై

ఈపట్టణమునకంతా ఖ్యాతిసంపాదకులయిన మిమ్ముకు ఆయురారోగ్యైశ్వర్యాదులచేత నిశోవ్యధికముగా కాపాడుచుండునట్లు సర్వశక్తిసంపన్నుడయిన భగవంతుని ప్రార్థించెదము.

అక్షయనామసంవత్సర నిజజ్యేష్ఠ శు ౧౦ శుక్రవారము.

ధూళిపాటి వెంకటసుబ్బయ్య.
కల్లూరి వెంకన్న.
అత్రపాల వెంకట్రాయులు.

గుంటూరు లక్ష్మీనరసయ్య.
కోనూరు సూరయ్య.
కల్యాణం కుప్పుస్వామిశాస్త్రి.

వీరలు మొదలయిన ౪౦౦ చేవ్రాలవారలు.

ఆస్తికమహాశయులారా! గడచిన క్రోధనసంవత్సర మాఘ కృష్ణాష్టమీ భాను వాసరంబున గుడివాడ తాలూకా కోటవెంకటపాలెం గ్రామవాస్తవ్యులైన బ్ర. వే. చదలవాడ విద్యారణ్యశాస్త్రులను నామాంతరముగల అనంతరామశాస్త్రులుగారు* చెన్నపురియందు వ్యాకరణాధ్యాపకులై యుండిన బ్ర॥ వే. సీ. వీ. రంగనాథశాస్త్రులవారిచే ప్రేరేపింపబడి యువతీవివాహసాధకముగా వివాహ్యకన్యావయోనిరూపణ మను గ్రంథమును రచించి యుండిరి. ఆగ్రంథమును చతుష్షష్టికళాత్మ కాలంకారసార్వభౌమ బిరుదాంకితులైన బ్ర॥ వే. కట్టం వెంకన్నశాస్త్రులుగారు ఖండించిరి. ఆ ఖండనగ్రంథము సిద్ధాంతసిద్ధాంజన మను పేరను, వాదప్రహసన మను పేరను బరగుచున్నది. అయ్యవి సంస్కృతభాషయందు రచింపబడుటచే సంస్కృతము తెలియని యాస్తికులకు అందలి దుర్వాదఖండనాపద్ధతులు గ్రాహ్యములు గానందువలన దానిని ఆంధ్రీకరించితిని. ఖండనగ్రంథము శాస్త్రజటిలమై యుండుటవలన దానిని సుగ్రాహ్యముగా నాంధ్రీకరించుట దుష్కరమైన విషయ మని యెఱుగుదురు పఠితలే! శాస్త్రీయమైన విషయములను విడిచి యితరమైన భాగములను ఆంధ్రీకరించుటవలన గ్రంథకర్తయొక్క ప్రతిభ వెల్లడి గాదు. కాన సాధ్యమైనంతవరకును శాస్త్రీయమైన విషయములను కూడ సాధారణమైన వ్యుత్పత్తిగలవారికి గోచరించుట కనువుగా మూలగ్రంథమును ఆంధ్రీకరించితిని. ఇట్లు ఆంధ్రీకరించినప్పటికిని దీనియందు మూలగ్రంథమునందలి శాస్త్రజాటిల్యము కొంతవరకు ప్రతిఫలించుచునే యున్నది. మూలగ్రంథమును వదలి దానియందలి ఆశయమునే గ్రహించి స్వతంత్రగ్రంథముగా వ్రాయుట యను పద్ధతి శాస్త్రగ్రంథములవిషయమునం దుపయోగపడదు. వాదగ్రంథములన్నియు ప్రతిజ్ఞాహేత్వాదులతో నిండియుండును. అవి యెన్నటికిని వ్యుత్పత్తిని మించి మఱియొకసాధనముతో నేభాషయం దున్నప్పటికిని గ్రహింప శక్యములు కావు. ఈ యంశములను పాఠకులు బుద్ధియందుంచుకొని యీగ్రంథమును చదువ గోరుచున్నాను. ఈ ఆంధ్రానువాదమందు నేదేని దోషములున్నను వ్యుత్పన్నులకు సయితము దుర్గ్రాహమైనంతటి శాస్త్రజాటిల్యమున్నను దయచేసి తెలిపినచో ద్వితీయముద్రణమునందు తగు మార్పులను చేయగలను. అదిగాక అధర్మభూయిష్ఠమైన ఇక్కాలమున ఇట్టి గ్రంథముల యవసరము సముచితము ఆలోచింపవలసియున్నది. ప్రతివారును ఇందలి వాదములను యుక్తులను నేర్చుకొని వివాహవిషయమునందు కలిసంభవముగా భారతారణ్యపర్వమున మార్కండేయ యుధిష్ఠిరసంవాదమందలి "కన్యాం న యాచతే కశ్చి

---

* వీరు మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీ ఆంధ్రపండితులు శ్రీ చదలవాడ సీతారామశాస్త్రిగారి సోదరులు. శ్రీ విద్యారణ్యశాస్త్రులు మహాయోగి, ఏకసంథాగ్రాహియు. వీరు కొల్లావారి అగ్రహారమున దివాన్ బహాదూరు మల్లూరి ఆదినారాయణయ్యగారి వాకిటనుండేవారు.

కృచ్ఛ్రకృచ్ఛ్రాప్రదీయతే, స్వయంగ్రాహా భవిష్యన్తి యథా గాన్తే సముపస్థితే” యని చెప్పబడిన స్వయంవరవివాహములకు మనఃపూర్వకముగా తా నొసగక ధర్మపరులు కాఁగోరిరని. ఇందలి వాదయుక్తులను గ్రహింపజాలనివారు ధర్మ్యవివాహ మన నేమి? అధర్మ్యవివాహ మన నేమి? యని స్థూలముగ గ్రహించి తమపుత్రికలను ధర్మబద్ధముగా వివాహసంస్కారముచే పవిత్రులను గావించి దానిచే తమ్మును ఋణవిముక్తులను గావించుకొని యైహికాముష్మికఫలముల బడయుందురుగాక యని యాశించుచున్నాను. శిథిలావస్థయం దున్న మూలగ్రంథమును జూపి దానికి ఆంధ్రానువాదమును వ్రాసి ఇయ్యఁగల నని చెప్పుటయే తడవుగా నాకోరికను మన్నించిన ఆస్తికవరేణ్యులును, ధర్మోద్ధారకులును, భాషోద్ధారకులును ఆనువంశికముగా తాము పండితు లగుటయేగాక పండితోత్తములను ఆదరించువారును, ఇట్టి ధర్మప్రతిపాదకములగు నపూర్వగ్రంథములను వ్యయప్రయాసల కోర్చి ప్రకటించి ఇక్కాలమున ఆర్షవైదికసంప్రదాయముల కండయై విలసిల్లుచున్న వారునైన బ్ర. వే. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు దీనిని ప్రకటించినందులకు వారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. మఱియును ఈ వాదగ్రంథమును ఆంధ్రీకరించుసమయమున నెల్లూరు వేదసంస్కృతకళాశాలా న్యాయాలంకారపండితులైన బ్ర. వే. వుడాలి నరసింహశాస్త్రులవారి కుమారులు బ్ర. వే. సుబ్బరామశాస్త్రులు సహకార మొసంగినందులకు వారికిని నేను చాల కృతజ్ఞుఁడను.

బుధజనవిధేయుఁడు,

వేదము సుబ్రహ్మణ్యశర్మ,

అల్లూరు, కోవూరుతాలూకా, నెల్లూరుజిల్లా.

# ప్రకాశక విజ్ఞప్తి.

ఈ గ్రంథము దీర్ఘకాలముగ అరుదైయుండఁగా శ్రీ వేదము వేంకటరాయఁడు గారు తాము రచించిన వేంకటరాయశాస్త్రిగారి జీవితమున కీ॥ శే॥ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారే ఈ గ్రంథమునకు కర్త లని వ్రాసియుండిరి. లోకులకా మాటలలోని నిజము బయల్పఱచుటకై దీని నిప్పుడు ప్రచురించితిని. ఆస్తికమహాశయులెల్లరు దీనిం జదివి తృప్తిచెంది ధర్మాసక్తులగుదురుగాక యని కోరుచున్నాను.

తండయార్పేట,<br>చెన్నపట్నము.<br>1932.

ఇట్లు,

వావిళ్ల వేంకటేశ్వరులు.

శ్రీగణేశాయనమః

# సిద్ధాన్తసిద్ధాంజనాఖ్యవాదప్రహసనము

## సాంధ్రతాత్పర్యము

---

### గ్రన్థారమ్భపీఠికా

"హరిహయాది సురసమూహ వన్దితాఙ్ఘ్రిపల్లవా
మసురకోటినాశయ భీమరూపధారిణీమ్,
వినతలోక సులభయత్న సిద్ధిదాం పరామ్బికాం
విమలచేతసా నమామి సర్వవిఘ్నశాన్తయే." 1

"కల్యాణదాయిని కళానిధిశేఖరే మే
చిత్తం సదైవ విహరత్వవతీర్య భూమౌ,
యోభాగ్యదీపకలికయా కృపయావ్యతానీ
దాత్మస్థమోహతిమిరం బత నామశేషమ్." 2

"శ్రీమచ్ఛంకర మస్కరీన్ద్రచరణామ్భోజాత యుగ్మార్చన
ధ్యానాధీనహృదా ముదావిరచితా నేతాన్ప్రణామాన్మయా,
అఙ్గీకృత్య సదా దదత్వభినవం జ్ఞానం గురౌనమ్రతాం
గ్రన్థస్యాస్య మహోన్నతిం చ విపులాం వాణీ రమో మేశ్వరాః." 3

"కర్మకాండచోదితాఖిల ప్రచణ్డసత్క్రియా
రక్షణైకదీక్షిత మ్మదీయతాత సోదరమ్,
పాణినీయతన్త్ర పారదర్శినం తపస్వినం
సర్వవన్ద్యమప్పశార్య మద్య నౌమి మద్గురుమ్." 4

కర్మకాండవిహితములైన కర్మలను అనుష్ఠించు నా తండ్రిసోదరుడును వ్యాకరణశాస్త్ర పారంగతుడును, తపస్వియునగు అప్పన్నయను నాగురువును నమస్కరించుచున్నాను.

"అశ్వాఖ్యే వటమావనీసురకులే విఖ్యాతిశాయిన్య భూ
ద్రామస్వామి బుధోత్తమోహి జగతి త్రయ్యన్త సారార్థవిత్,
సర్వోర్వీశ సభావిభూషణ లసద్భాషావిశేషోదయో
ద్వైత్యారణ్య కుఠారవాక్చతురిమా దాతా దయాదాన్తిమాన్." 5

వశమశాఖయందు గుఱ్ఱమువారివంశము చాల ప్రసిద్ధమైనది. అందు పండితుడు వేదాంతశాస్త్రపారంగతుడు సమస్త బ్రాహ్మణసభలయందు వాక్చాతుర్యమును ప్రకటించి కీర్తిగడించినవాడును ద్వైతమతఖండనమునందు ప్రతిష్ఠగాంచినవాడును అగు శ్రీరామస్వామిపండితుడు నాకు తండ్రి.

"తేషాహం పితృమాజనిష్ట ధృతిమా జారూఢ శాకాశ్రితా
పాధోరాశితటో మహేశకృపయా సమ్యాప్త వాగ్విజృంభణః,
ఆలఙ్కారిక సార్వభౌమబిరుద ప్రఖ్యాత శోభాంవహో
ధీపాణ్డిత్య దిగన్తవిశ్రుతయశా వెంకన్న నామాభవమ్." 6

నా పేరు వెంకన్న. నేను నానావిద్యలయొక్క పారమును గాంచినవాడను. పరమశివుని ప్రసాదముచే వాగ్విజృంభణమును సంపాదించినాడను. ఆలంకారికసార్వభౌముడను బిరుదముచే నేను అలంకరింపబడియున్నాను. ప్రతిభచేతను, పాండిత్యముచేతను నాకీర్తి సకలదిక్కులయందును వ్యాపించియున్నది.

"యే కేచిత్కలికాలయోగ్యకుధియ స్స్వాచార హీనాః పరం
హూణాద్యాధునికావనీపహృదయాహ్లాదార్థ వాదాతురాః,
వేదార్థానఖిలానఖణ్డతపసా సంగృహ్య సన్మార్గదా
యేఽభూవన్మనవో మనుప్రభృతయ స్తద్దూషకాణాం ముదే." 7

ఈ కలికాలమునకు తగినట్లు ఆచారభ్రష్టులై కుత్సితబుద్ధికలిగిన కొందరు హూణులు మున్నగురాజుల చిత్తమును రంజింపచేయుటకు నాస్తికవాదమునందు ఆసక్తులై కనపడుచున్నారు. అఖండమైన తపముచే సకలవేదార్థములను సంగ్రహించి సన్మార్గమును ఉపదేశించు మనువు మొదలగువారిని దూషించు నాస్తికులకు సంతోషమును కల్పించుటకై యత్నించుచున్నారు.

"ముఖప్రియం విధాయ జీవితుం కుమార్గగామినాం
విదూష్య శాస్త్రపద్ధతిం వినిన్ద్య సద్విచేష్టితమ్,
అనన్తరామశాస్త్రిణా ప్రబన్ధమార్యదూషకం
కృతం రజస్వలావివాహసాధకం కుయుక్తిభిః." 8

వారికి ముఖప్రీతిని చేసి జీవించుటకు శాస్త్రపద్ధతిని దూషించి శిష్టాచారమును నిందించి అనంతరామశాస్త్రి ఆర్యదూషకమైన రజస్వలావివాహసాధకమైన గ్రంథమును రచించెను.

"యువత్యాస్తదిచ్ఛానుగుణ్యేన లోకే ద్విజాగ్ర్యైర్వివాహోఽపి గాన్ధర్వరీత్యా,
సుకర్తవ్యమిత్యార్థ ప్రకల్ప్య మనోరిష్టమిత్యాహ నేత్రే నిమీల్య." 9

యువతి స్వేచ్ఛానుసారము గాంధర్వపద్ధతిని ద్విజాదులను వివాహమాడవచ్చునని మనువచనమునకు కనులనుమూసుకొని అపార్థమును కల్పించుచున్నాడు.

"మనుస్మృతి విరోధ్యర్థ ప్రతిపాదనహేతునా,
మునేః పరాశరస్యాపి స్మృతేస్త్యాజ్యత్వ ముక్తవాన్." 10

మనుస్మృతికి విరుద్ధముగనుండుటవలన పరాశరస్మృతిని ఉపేక్షించవలయుననియు ఆతడు చెప్పెను.

"జరాసముద్భవావివేకదూషితం విలేఖనం
కథం హి వైద్యనాథదీక్షితీయ మావహేస్మ జన్,
విపశ్చితాంకిలేత్య సౌలిలేఖ సత్త్వపావనీ
ర్ణలజ్జయాస్విదూషితు మ్మదేనయోగ్యతాదపి." 11

"కృతం తేన మూర్ఖప్రమోహాయ సర్వం
విరుద్ధం స్మృతీనాం విహీనంచతర్కైస్తథా,
గృహీత్వాభినన్దన్తు కేచిద్విమూఢాః
కలేరేష ధర్మోత్ర నాశ్చర్యమస్తి." 12

అతని రచనయంతయును మూర్ఖులను మోహపరచుటకే. అది స్మృతులకు విరుద్ధము. శ్రేష్ఠమైనయుక్తులు లేనియున్నది. దానిని గ్రహించి కొందరుమూఢులు అభినందింతురుగాక. ఇది కలియుగధర్మము గాన నిం దాశ్చర్యమేమియును లేదు.

"సిద్ధాంతశబ్దపూర్వక సిద్ధాఞ్జన నామకేనాద్య,
వాదప్రహసనవిధినా తద్గ్రన్థం ఖణ్డయామి ముదా." 13

సిద్ధాంత సిద్ధాంజనమను పేరుగల వాదప్రహసనగ్రంథముచే నతనిగ్రంథమును నేను ఖండించుచున్నాను.

"ప్రథమే తత్కృతగ్రన్థనామధేయ నిరాకృతిః,
ద్వితీయే తత్కవనైపుణ్యానాదర స్తథా." 14

మొదట దతని గ్రంథనామధేయనిరాకరణము. రెండవది ఆతని కవనకౌశలమును తిరస్కరించుట.

"తృతీయే యువతీ పాణిగ్రహవాదస్య భఞ్జనమ్,
కన్యానుమత్యాదానస్య నిరాసస్తు చతుర్థకే." 15

మూడవది-యువతీ పాణిగ్రహణవాద నిరాకరణము. నాల్గవది-కన్యయొక్క అంగీకారముచే దానమును నిరాకరించుట.

"పఞ్చమేతు ద్విజాగ్ర్యాణాం గాన్ధర్వస్య చ ఖణ్డనమ్,
షష్ఠే పరాశరస్యోక్తే స్త్యాజ్యత్వస్య నిరస్క్రియా." 16

అయిదవది-బ్రాహ్మణులకు గాంధర్వవివాహఖండనము. ఆఱవది - పరాశరవచనము త్యాజ్యమనుటను నిరాకరించుట.

"సప్తమే వైద్యనాథార్య దోషారోపస్య ధిక్కృతిః,
అష్టమే తత్కృతగ్రన్థమామూలం పర్యఖణ్డయమ్." 17

ఏడవది-వైద్యనాథదీక్షితులపై చేసిన దోషారోపణమును నిరాకరించుట. ఎనిమిదవది-ఆగ్రంథమునంతటిని ఖండించుట.

"సద్యుక్తిస్సుప్రమాణేస్సం కృతిర్దుర్వాదఖణ్డికా.
వినోదయతు చేతాంసి విదుషాం శుకవాగివ." 18

సద్హేతువులతోను ప్రమాణములతోనుకూడి దుర్వాదములను ఖండించు యీ గ్రంథము చిలుకపలుకులవలె విద్వాంసులమనములను వినోదపరచుగాక.

"అష్టభిః పరిహాసైశ్చ సంయుతం మత్కృతంభువి,
ఇదంవాదప్రహసనం జీయాదాచన్ద్రతారకమ్." 19

ఎనిమిది పరిహాసములతోకూడిన యీ వాదప్రహసనము, ఆచంద్రతారకము భూమియందు జయమొందుగాక.

"యద్దృష్ట్వాతోషమాయాన్తి పణ్డితా యే విమత్సరాః
తత్సమత్సరచిత్తానాం కథమానన్దకం భవేత్." 20

గ్రన్థారంభపీఠికా సంపూర్ణా.

ఏ ప్రహసనమును చూచి అసూయలేని పండితులు సంతసించుచున్నారో ఆ ప్రహసనము అసూయకలిగిన మూఢులకు ఆనందమును యెట్లుకూర్చును.

గ్రంథారంభపీఠికకు తెనుగు పూర్తి అయినది.

---

# వాదప్రహసనలక్షణమ్

దశరూపక వ్యాఖ్యానే-శతరూపకే-భోజరాజః,—

"ప్రతిప్రకరణస్యాన్తే ఖణ్డ్యవాదానుసారిభిః." 1

"ఇతిహాసైః ప్రహసనీయైశ్చోపమియ చమత్కృతం,
పాత్రప్రవేశరహితం చిత్రవృత్త సమన్వితం." 2

"పరిహాసాఖ్య ప్రకరణైర్యుతం దుర్వాదఖణ్డకం,
విద్వత్సన్తోషజనకం వాదప్రహసనం విదుః" 3

"వాదప్రధానం ప్రథమం రమ్యం ప్రహసనేష్విదం."

ఇతి ప్రహసనలక్షణం సంపూర్ణమ్.

---

# ప్రథమ పరిహాసము

అత్రాదౌ విచారణీయమేతత్ అనన్తరామశాస్త్రిభి ర్యువతీవివాహసిద్ధ్యుపయోగితయా కృతస్య గ్రన్థస్య యద్వివాహ్యకన్యాస్వరూపనిరూపణమిత్యభిధానం కృతం కిం తత్సఙ్గచ్ఛతే నవేతి.

అనంతరామశాస్త్రులు యువతీవివాహము సాధింపగోరి రచించిన గ్రంథమునకు వివాహ్యకన్యాస్వరూపనిరూపణమని పేరుపెట్టిరి. ఈ నామము సరిపడునా సరిపడదా అనునది మొదట విచారణీయమైన విషయము.

తన్నసఙ్గచ్ఛతే అభిధానస్యాభిధేయవిరుద్ధత్వాత్. తథాహి — యస్య మనోర్మతమాత్రావలంబినః యువతీవివాహం సాధయితుమిచ్ఛయా ప్రవృత్తా స్తేషాం మనునైవ, కన్యోక్త్యా కన్యాయువత్యోర్భేదః నిరూపితః తథాచ. మనుః ఏకాదశాధ్యాయే. 36 శ్లోకః. నవై కన్యాయువతిర్నాల్పవిద్యో న బాలిశః హోతా స్యాదగ్నిహోత్రస్య నార్తో నాసంస్కృతస్తథా. అష్టమాధ్యాయే 367 శ్లో. అభిషహ్య తు యః కన్యాం కుర్యాద్దర్పేణ మానవః, తస్యాశు కర్త్యే అఙ్గుల్యౌ దండంచార్హతి షట్శతం

ఈ నామధేయము గ్రంథమునకు సరిపోవునా? నామధేయమునకును, దానివలన వాచ్యమైన సంకలితార్థమునకు సంబంధము లేదు. వాచ్యార్థమునకును నామధేయమునకు విరుద్ధము పొసగకున్నది. ఎట్లన, మనువుయొక్క మతమును మాత్రమే అవలంబించి యువతీవివాహమును సాధింప ప్రయత్నించిరి. కాని ఆమనువే కన్యోక్తిగా కన్యాయువతులకు భేదమును నిరూపించుచున్నాడు. మ. 8-వ అధ్యాయము. 36-వ శ్లో. తాత్పర్యము. కన్యయు, యువతి, అల్పవిద్యుడు, బాలుడు, ఆర్తుడు, సంస్కారశూన్యుడు అగ్నిహోత్రమునకు హోతలు కాసేరరు. మ 8 అధ్యాయము. 367 శ్లో. బలాత్కారముగ సమజాతీయ కన్యను అంగుళిప్రక్షేపముచే నాశముచేయువాని అంగుళిద్వయమును ఛేదింపవలయును. 600 పణములు దండమును విధింపవలయును.

మ. అష్టమాధ్యాయే ఏవ. 369 శ్లోకః. కన్యైవ కన్యాం యా కుర్యాత్తస్యాస్స్యాద్ద్విశతో దమః. 370 శ్లో. యాతు కన్యాం ప్రకుర్యాత్ స్త్రీ సాసద్యో మౌణ్డ్యమర్హతి.

మ. 8 అ. 369 శ్లో. కన్యను అంగుళిప్రక్షేపముచే నాశముచేయు కన్యకు రెండువందలపణములు దండము. మ. 8 అ. 370 శ్లోకము. అంగుళిప్రక్షేపముచే కన్యను పాడుచేయు స్త్రీకి ముండనము శిక్ష.

మ. ద్వితీయాధ్యాయే. 212 శ్లోకః. గురుపత్నీ తు యువతిర్నాభివాద్యేహ పాదయోః.

మ. 2 అధ్యాయం. 212 శ్లో. యువతియైన గురుపత్నికి, యౌవనుడైన శిష్యుడు అభివాదనము చేయరాదు.

మ. ద్వితీయాధ్యాయే. 216 శ్లోకః. కామంతు గురుపత్నీనాం యువతీనాం యువాభువి. ఇతి.

తథాచామరసింహః —

కన్యా, కుమారీ, గౌరీతు, నగ్నికా నాగతార్తవా, స్యాన్మధ్యమా దృష్టరజాస్తరుణీ యువతిస్సమేతి. ఏవం కన్యాయువత్యోః పార్థక్యేన గ్రహణాదయువతీకన్యేతి సిద్ధే కథమ యువతీస్వరూపనిరూపణాభ్యాం యువతీవివాహం సాధయేత్.

మ 2 అధ్యాయం 216 శ్లో. పాదగ్రహణము లేక యువకుడును గురుపత్నులయిన యువతులకు అభివాదనము చేయవచ్చును. అమరసింహుడు కన్యా, కుమారీ, గౌరీ, చ, నగ్నికా నాగతార్తవా, స్యాన్మధ్యమాదృష్ట రజాస్తరుణీ యువతిస్సమా. అని కన్యా యువతులను వేరువేరుగా గ్రహించుటవలన యువతికంటె భిన్నమయినది కన్యయని సిద్ధించుచున్నది గనుక ఆ యువతీస్వరూపనిరూపణ మనునర్థము ఇయ్యగల నామధేయముగల యీగ్రంథము యువతీవివాహము నెట్లుసాధించును.

నచాత్రకన్యాశబ్దేనా వివాహితా గ్రాహ్యేతి-వాచ్యం-వివాహితాయా అప్యయువత్యాః కన్యాశబ్దేన గృహీతత్వాత్ - తథాచ-స్మృత్యర్థసారే-హోమప్రకరణే. పర్యుక్షణం వినాపత్నీ జుహుయాత్కన్యకాపిచేతి. ప్రజాపతిశ్చ-ద్వివర్షాత్ప్రాగ్వివాహశ్చేత్కన్యకామరణం యది. ఖననం నైవకర్తవ్యం మంత్రసంస్కారమాచరేదితి. జాబాలిః. కన్యామపి పతిర్భార్యాం రక్షేద్యత్నేనమానవ ఇతి. నారదోపి. కన్యా మపికృతాభిస్నాం నాన్యస్మైదాతు మర్హతీతి. యానివాహ్యా - సైవావివాహితా. అవివాహితాయా నైవ వివాహ్యాచేత్యర్థ సిద్ధానువాదాత్ విశేష్యవిశేషణాన్యతరవైయర్థ్యాపత్తేశ్చ.

ఇచ్చట కన్యాశబ్దముచే అవివాహితను గ్రహింపవలయునని శంకింపకూడదు. వివాహిత అయినను యువతిగాని స్త్రీని కన్యయనియే గ్రహించుచున్నారు. స్మృత్యర్థసారమున హోమప్రకరణములో భార్య కన్యయైనను పర్యుక్షణములేక హోమము చేయవచ్చును అని ప్రజాపతియు రెండుసంవత్సరములకుముందు వివాహితయైన కన్య మరణించినచో ఖననము చేయరాదు. మంత్రపూర్వకసంస్కారము చేయవలయును అని జాబాలియు; మనుష్యుడు భార్య కన్యయైనను ప్రయత్నముతో రక్షించుకొనవలయునని నారదుడును, ఒకనికి దత్తమైనకన్యను తండ్రి మరియొకనికి దానము చేయుంట కనర్హుడు అని వివాహము చేయతగినది అవివాహితయే. అవివాహితయే వివాహమునకు అర్హురాలు అని అర్థసిద్ధమైన అనువాదమువలన వివాహ్యకన్యాస్వరూపమనునెడ వివాహ్యారూపవిశేషణము గాని లేక కన్యారూపవిశేష్యముగాని వ్యర్థమగుచున్నది. అనగా కన్యాస్వరూపనిరూపణమనియు, వివాహ్యాస్వరూపనిరూపణమనియు నామధేయము ఉండతగినదిగాని వివాహ్యాకన్యాస్వరూపనిరూపణమని నామధేయము ఈగ్రంథమునకు తగదు.

కన్యతే కామ్యత ఇతి వ్యుత్పత్త్యా కన దీప్తికాన్తి గతిష్వితి కనధాతోః కాన్త్యర్థకత్వేన కథమరంజాతరజస్కాయాః కన్యాయాః కామ్యత్వమితి వాచ్యం. శ్లో. పతన విరళైః ప్రాన్తోన్మీలన్మనోహరకుట్మలై ర్దశనకుసుమై ర్ముగ్ధాలోకం శిశుర్దధతీ ముఖం, లలితలలితై ర్జ్యోత్స్నాప్రాయై రకృత్రిమవిభ్రమై రకృతమధురై రఙ్గానాం మే కుతూహల మఙ్గకై రిత్యుత్తరరామచరితే - భగవతా-కవిసార్వభౌమేన భవభూతినా - శిశుత్వ విశిష్టాయా అపి సీతాయా అఙ్గస్పర్శమాత్రేణ రామాఙ్గానా మాహ్లాదకరత్వస్య ప్రతిపాదితత్వేన న కన్యాయాః కామ్యత్వమస్తీతి వక్తుమశక్యత్వాత్.

కన్యతే=కోరబడునది యను వ్యుత్పత్తిచే కనధాతువునుండి కన్యాశబ్దము నిష్పన్నమయినది గాన రజస్వలగానికన్య కామింపతగినదిగ నెట్లుకాగలదు అని శంకింపరాదు. ఉత్తరరామచరితమున (పతనవిరళైః) అను పద్యమున దంతములు రాలిపోయి మరల నూతనదంతములతోను, కుసుమములతో మనోహరమైన ముఖమును ధరించు శైశవమునందున్న సీత సహజవిలాసమాధుర్యములు గల వెన్నెలవంటి ప్రియమైన అవయవములచే నా అంగములకు ఆహ్లాదమును కూర్చుచున్నది యని భవభూతి శిశుప్రాయురాలగు సీతయొక్క అవయవస్పర్శము చేతనే రాముని అవయవములకు ఆహ్లాదము కలిగినట్లు వర్ణించుటవలన కన్య కామింపదగదని శంకింప నవకాశములేదు.

నచకన్యా శబ్దో యద్యపి యువత్యామేవరూఢస్తర్హి - ఇచ్ఛయాఽన్యోన్యస్య సంయోగః కన్యాయాశ్చ వరస్యచ. గాన్ధర్వస్సతువిజ్ఞేయో మైథున్యః కామసంభవ ఇతి గాన్ధర్వవివాహలక్షణే కన్యాయా స్సంయోగాదిక్రియాయోగ్యతా కథం సఙ్గచ్ఛత ఇతి వాచ్యమ్. అత్ర సంయోగాదే రాలిఙ్గనాది బాహ్యసురతమాత్రపరత్వాత్ అన్యథా పరపూర్వాత్వాపత్తేః.

కన్యాశబ్దము యువతిగాని స్త్రీయందే రూఢమైనచో కన్యావరులు పరస్పరేచ్ఛచే పరస్పర సంయోగముచేసిన నది గాంధర్వవివాహ మనులక్షణమునుబట్టి కన్యకు సంయోగక్రియార్హత లేనందువలన కన్యాశబ్దము యువతి భిన్నపరమని చెప్పుటకు నెట్లు శక్యమని శంకింపరాదు. లక్షణమున సంయోగశబ్దమునకు ఆలింగనాది బాహ్యసురతమునందే తాత్పర్యము లేనిచో వరుని వివాహమాడి దృష్టరజస్కయగు స్త్రీని గాంధర్వవివాహలక్షణమున గ్రహింపవలసివచ్చును.

నచాలిఙ్గనాది బాహ్య సురతమాత్రస్య కథం సంయోగశబ్దవాచ్యతేతి వాచ్యమ్. సంయోగస్య బాహ్యాన్తరవిభేదేన ద్వైవిధ్యస్య వాత్స్యాయనాదిభి ర్నిర్ణీతత్వాత్. శ్లో. 'దర్శనం స్పర్శనం కేళిః కీర్తనం గుహ్యభాషణమ్. సఙ్కల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవ చ, ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః' ఇత్యాలింగనాదేరపి సంయోగాఙ్గత్వేన స్మృతికర్తృభి ర్గృహీతత్వాచ్చ.

సంయోగమునకు ఆలింగనాది బాహ్యసురతములయందే తాత్పర్యమని చెప్పుట కెట్లుశక్యమని శంకింపరాదు. వాత్స్యాయనాదులు బాహ్యము ఆంతరమని ఇరుతెరంగు

లుగ సంయోగమును విభజించియున్నారు. చూచుట, తాకుట, క్రీడ, ఒకరినిగురించి ఒకరు చెప్పుకొనుట, రహస్యసంభాషణము, మానసచింత, విశ్వాసము, కార్యమును పూర్తిచేయుట, యని మైథునము ఎనిమిది అంగములతో కూడియున్నదని పండితులు చెప్పుచున్నారు.

న చ సుప్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి. స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః. ఇత్యుక్తలక్షణస్యైవ పైశాచ వివాహలక్షణత్వేన గృహీతత్వాత్ కథమపుష్పవత్యాః కన్యాయాః ఉపసఙ్గమ స్సఙ్గచ్ఛత ఇతి వాచ్యమ్. కావ్య జీవిత భూతరసాసమవాయికారణోద్దీపన విభావ చతుష్టయ గుణచేష్టాలంకృతి తటస్థానామాద్యగుణ సప్తక యౌవనరూపలావణ్య సౌన్దర్యాభిరూపతా మార్దవ సౌకుమార్యాణామాద్యస్య యౌవనస్యాఙ్కురిత స్తనాది ఋతుదర్శనపర్యన్తస్య ప్రథమత్వం తత్ప్రభృతి స్తనపతనావధి ద్వితీయత్వం తదాది ప్రసవాన్తస్య తృతీయత్వం తదుపర్యా రజోనివృత్తి తురీయత్వం చేతి. చతుర్ణామప్యేతేషాం యౌవనానాం పురుషసంభోగయోగ్యత్వస్యాలఙ్కారికైస్సిద్ధాన్తితత్వాత్ తథాచ రసార్ణవసుధాకరే సర్వాసామపి నారీణాం యౌవనం తు చతుర్విధమ్, ఉన్మీలితాఙ్కురితకుచ మస్పష్టాఙ్గకసన్ధికమ్, ప్రథమం యౌవనం తత్ర వర్తమానా మృగేక్షణా, అపేక్షతే మృదుస్పర్శం సహతే నోద్భటాం రతిమ్. నాతిలజ్జతి కాన్తస్య సఙ్గమే కిన్తు లజ్జతేతి.

నిద్రించునదియు, మత్తురాలును అయినకన్యను రహస్యమున సంగమించుటచే నేర్పడినది రాక్షసవివాహము. వివాహములలో నిది పాపిష్ఠమైనది అని సంగమమే పైశాచవివాహలక్షణముగా గ్రహించుటవలన పుష్పవతిగానికన్యను సంగమము యెట్లు సంభవించునని శంకింపరాదు. కావ్యజీవితభూతమైన రసమునకు గుణచేష్టాలంకృతి తటస్థము లను నాలుగువిధములు కలిగిన ఉద్దీపనవిభావము. అసమవాయికారణము మొదటి ఉద్దీపనవిభావములో యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము, అభిరూపతా, మార్దవము, సౌకుమార్యము లనెడు ఏడుగుణములు చేరియున్నవి. అందు మొదటిదగు యౌవనమునకు అవస్థలు నాలుగు అంకురితస్తనాది ఋతుదర్శనపర్యంతము ప్రథమావస్థ. అదిమొదలు స్తనపతనపర్యంతము ద్వితీయావస్థ. అదిమొదలు ప్రసవపర్యంతము తృతీయావస్థ. అటుపై రజోనివృత్తివరకు చతుర్థావస్థ. ఇట్లు నాలుగు అవస్థలతో కూడిన యౌవనమంతయు పురుషసంభోగయోగ్యమని అలంకారికసిద్ధాంతము. రసార్ణవసుధాకరమునందు స్త్రీలకందరికి యౌవనము నలువిధములుగ విభజింపబడియున్నది. అందు ప్రథమయౌవనమునందు స్తనము లంకురించును. అంగసంధులు స్పష్టముగనుండవు. ఆ యౌవనమునందు యువతి మృదుస్పర్శమును అపేక్షించును. విశేషమైన రతిని సహింపజాలదు. కాంతునితోడి సంగమమునందు యెక్కువగ లజ్జపడదు. కొద్దిగ లజ్జపడును.

న చ రజస్వలైవ ఆద్యయౌవనవిశిష్టేతి వాచ్యమ్. ప్రథమయౌవనకాల నిరూపణేన దత్తోత్తరత్వాత్. స్తనాపీనా తనుర్మధ్యః పాదేపాణౌచరక్తిమా, వ్యక్తారోమావళీ

నచ నిషేకస్వరూప కాలయోరనుక్తత్వాన్మనువాక్యే కథం నిషేకస్య పురుషసంసర్గ రూపత్వం ఋతుదర్శనాత్ప్రాక్కరణీయత్వం చేతివాచ్యమ్. తయోర్గృహ్యకారై ర్నిరూపితత్వాత్ తథాచాశ్వలాయనః వర్షాద్ద్వాదశకాదూర్ధ్వం యది పుష్పంబహిర్నహి. అంతఃపుష్పం భవత్యేవ పనసోదుమ్బరాదివత్, అతస్తత్ర ప్రకుర్వీత తత్సఙ్గం బుద్ధిమాన్నరః, నిషేక ఇతితత్ప్రోక్తం మునిభి ర్ధర్మదర్శిభి రితి.

నిషేకస్వరూపమును, దానికాలమును మనువు నిర్దేశింపనందువలన నిషేకము పురుషసంసర్గ రూప మనుటెట్లు. ఋతుదర్శనమునకుముందు దాని ననుష్ఠింపటయు యెట్లు అని శంకింపరాదు. ఆరెంటిని గృహ్యసూత్రకారులు నిరూపించియున్నారు. ఆశ్వలాయనుడు పన్నెండుసంవత్సరములకుపైన పుష్పము వెలుపల లేకపోయినను పనసవృక్షము, మేడిచెట్టు మున్నగువాని కట్లు లోపల పుష్పించును గాన అందు బుద్ధిమంతుడైన పురుషుడు సంబంధము చేయవలయును. అదియే నిషేకమని ధర్మవేత్తలగు ఋషులు చెప్పియున్నారు.

నచ మన్వర్థవిరుద్ధత్వా ద్గృహ్యకారాది వచనమగ్రాహ్య ఇతివాచ్యమ్ ఛన్దోవత్సూత్రాణిభవన్తీతి స్మృత్యపేక్షయా సూత్రాణాం ప్రాబల్యస్యైవ స్వీకరణీయత్వాత్ కించ మన్వర్థవిపరీతార్థకథన ఏవేతరస్మృతేస్త్యాజ్యత్వమ్ మన్వనుక్తవిషయేతు అనుక్త మన్యతో గ్రాహ్యమితి న్యాయేనేతరస్మృతి ప్రతిపాదితస్యాపి గ్రాహ్యత్వమేవ అన్యథా మన్వనుక్తానాం యాజ్ఞవల్క్యోదితానాం దివ్యాదీనాం త్యాజ్యత్వాపత్తిః.

మనుస్మృతికి విరుద్ధముగ నుండుటవలన గృహ్యసూత్రకారాదులవచనము గ్రహింపతగినదికాదని శంకింపరాదు. (ఛందోవత్సూత్రాణిభవంతి) సూత్రములు వేదతుల్యమగుచున్నవనెడి స్మృతినిబట్టి సూత్రమునకు ప్రాబల్యము నంగీకరింపకతప్పదు. మరియు మన్వర్థమునకు విపరీతమగు నర్థమును చెప్పునపుడే ఇతరస్మృతులు ఉపేక్షణీయములు చెప్పనివిషయమునందు (అనుక్తమన్యతో గ్రాహ్యమని) మరియొకదానినుండి గ్రహింపవలెననెడి స్మృతి ననుసరించి ఇతరస్మృతులచేత ప్రతిపాదింపబడిన విషయములను గ్రహింపవలయును. కానిచో మనువుచే చెప్పబడని యాజ్ఞవల్క్యోక్తములగు దివ్యాదిప్రమాణములను త్యజింపవలసివచ్చును.

న చ పితృవేశ్మని కన్యాతు యం పుత్రంజనయేద్రహః తం కానీనంవదేన్నామ్నా వోఢుః కన్యాసముద్భవమితి. మ. 9 అ. 172 శ్లో. కన్యాయాః కథం పుత్రోత్పాదన యోగ్యతేతి వాచ్యమ్. కానీనః కర్ణోవ్యాసశ్చేతి తస్య వ్యాసకర్ణమాత్ర విషయత్వాత్.

మనువు 9-వ అధ్యాయం. 172 శ్లో. తాత్పర్యము. కన్య తండ్రి గృహమునందు రహస్యముగ కనినపుత్రుడు కానీనుడనియు, నతడు ఆకన్యను వివాహమాడిన పురుషునికి పుత్రుడగునను మనూక్తి ననుసరించి కన్యకు పుత్రోత్పాదనయోగ్యత యెట్లు కలిగినదని శంకింపరాదు. కర్ణుడు, వ్యాసుడు, కానీనులు గాన ఆవచనము వ్యాసకర్ణులను మాత్రమే విషయీకరించుచున్నది.

న చ తయోర్వ్యాకథం కానీనత్వ మభ్యుపగమ్యత ఇతి వాచ్యమ్. సూర్యపరాశర యోర్మాహాత్మ్యాతి ప్రాబల్యాఙ్గీకరణీయత్వాత్.

వారికైనను కానీనత్వ మెట్లు అంగీకరింపబడునని శంకింపరాదు. సూర్యపరాశరులమహిమ ననుసరించి వారికి కానీనత్వ మంగీకరింపబడుచున్నది.

న చ లోకానుభవవిరుద్ధ ఇతి వాచ్యమ్. లోకానాంతు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః, బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయదితి. మ. 1 అ. 3 శ్లో. మనువచనోదితస్య బ్రాహ్మణాదివర్ణానాం ముఖాదిజన్యత్వస్య వ్యాఘాతాపత్తేః నారద జాంబవ ద్వీరభద్ర ప్రభృతీనా ముత్పత్తేరగతికత్వాచ్చ.

ఏతేనాయంవతీ కన్యేతి సిద్ధేయంవతీ వివాహసిద్ధయిషయా స్వకృతగ్రన్థస్య వివాహ్యకన్యాస్వరూప నిరూపణమితి నామ కుర్వన్నోఽనన్తరామశాస్త్రిణో భూగోళత్వాభావవివక్షయా స్వకృతగ్రన్థస్య భూగోళనిర్ణయ ఇతి నామ కర్త్రా కొణ్డ్యణేన ఓష్ఠ్యవర్ణమన్తరా రామాయణం కర్తుం ప్రతిజ్ఞాయ నిరోష్ఠ్య రామాయణమితి నామ కర్త్రా చణ్డికేన చ సంప్రాప్తావహేళనాయాః పూర్ణభాజన మభూవన్.

ప్రథమపరిహాసః సమాప్తః.

అది లోకానుభవవిరుద్ధమని శంకింపరాదు. మనుస్మృతి 1 అ. 3 శ్లో. లోకము యొక్క అభివృద్ధికొరకు ముఖమునుండి బ్రాహ్మణుని, బాహువు నుండి క్షత్రియుని, ఊరువులనుండి వైశ్యుని, పాదములనుండి శూద్రుని సృజించెనను వచనమునను సరించి బ్రాహ్మణాదివర్ణములు ముఖాద్యంగములనుండి పుట్టుట యసంగతమగును. నారద జాంబవ ద్వీరభద్రాదులయొక్క ఉత్పత్తియు అసమర్థనీయమగును.

ఇంతవరకు చెప్పిన యుక్తులచే యంవతికంటె భిన్నమైనది కన్యయని సిద్ధించినది. యంవతీవివాహమును సాధింపగోరి తనగ్రంథమునకు వివాహ్యకన్యాస్వరూపనిరూపణమని పేరిడిన అనంతరామశాస్త్రులు భూమి గోళాకారముగ లేదని నిరూపించుటకు రచించిన గ్రంథమునకు భూగోళనిర్ణయమని నామమిడిన కొణ్డ్యణునితోను ఓష్ఠ్యవర్ణములు లేక రామాయణము రచింప ప్రతిజ్ఞ చేసి నిరోష్ఠ్యరామాయణమని పేరిడిన చండికునితోను సంప్రాప్తమైన అవహేళనకు పూర్ణపాత్రులైరి.

ప్రథమపరిహాసము సమాప్తము.

తల్లి భూతలికవలె నాచరించుచున్నదను నర్థమును, నిచ్చునదియై యున్నది. గాన ఆచారార్థక్యజంతమును గ్రంథారంభమున ప్రయోగించి స్వేప్సితార్థమునకు విరుద్ధార్థమును గ్రంథకర్త సంపాదించుకొని గ్రంథారంభముననే అన్యార్థమను కావ్యదోషమును కల్పించుకొనిరి.

న చావాసో విపినాయతే, ప్రియసఖీ మాలాపి జాలాయతే, తాపో నిశ్వసితేన దావదహనజ్వాలా కరాలాయతే, సాపిత్వద్విరహేణ హన్తహరిణీరూపాయతే. హా కథం కందర్పోఽపి యమాయతే విరచయన్ శార్దూలవిక్రీడితమ్. ఇత్యస్మిన్ జయదేవపద్యే జ్వాలా కరాలాయతేత్యత్ర కథం క్యజ్ప్రత్యయోఽభేదబోధకోఽభూదితి వాచ్యమ్. కరాళశబ్దస్య ధర్మపరత్వేన జ్వాలాభిః కరాళో భయంకరః దావదహనస్సో జ్వాలాకరాళస్స ఇవాచరతీతి సమాసాన్తరాశ్రయణస్య సుకరత్వాత్ జ్వాలాకలాపాయతే ఇత్యత్ర జ్వాలాకరాలాయత ఇత్యస్య పాఠాన్తరత్వాచ్చ.

ఆవాసో విపినాయతే — శార్దూలవిక్రీడితమ్. అను జయదేవుని పద్యమునందు జ్వాలాకరాలాయతే అనుచోట క్యజ్ ప్రత్యయము అభేదబోధకముగా నెట్లు ప్రయోగింపబడెనో ప్రకృతమును ప్రవరాయతే అనుచోట క్యజ్ ప్రత్యయము అభేదబోధకమని శంకింపరాదు. జ్వాలా కరాలాయతే అనుచోట కరాళశబ్దము ధర్మపరము. జ్వాలాభిః కరాళః దావదహనస్సో జ్వాలాకరాళస్స ఇవ ఆచరతీతి అను మరియొక సమాసమును ఆశ్రయించుట సుకరము. జ్వాలాకలాపాయతే అను పాఠాంతరము కలదు.

న చ మోక్షపురుషార్థ సాధకీభూతతురీయాశ్రమస్య జాగరూకత్వాదస్య గార్హస్థ్యస్య శ్రైష్ఠ్యమేవేష్టాపత్తిరితి వాచ్యమ్. త్రివర్గవిరోధి మోక్షఫలసాధకత్వం గార్హస్థ్యస్యేత్యుక్తోత్తరార్ధస్య వ్యాఘాతాపత్తేః. ఏతేన గార్హస్థ్యస్య శ్రైష్ఠ్యసమ్పాదనాయోపక్రమ్య అశ్రైష్ఠ్యమేవ సాధితవన్తో ఽనన్తరామశాస్త్రిణో నిరాకృతాః ప్రకృతగ్రన్థరచయితారం ప్రతి వానరకవి తివదతీవోపహాస్యతామాపాద్యన్తే.

సమాప్తోఽయం ద్వితీయః పరిహాసః.

మోక్షమనెడి పురుషార్థమునకు చతుర్థాశ్రమమే సాధకముగాన గార్హస్థ్యము అశ్రేష్ఠమైనను మాకు ఇష్టమేయని శంకింపరాదు. ధర్మార్థకామములనెడి త్రివర్గమునకు విరోధములేక మోక్షము గార్హస్థ్యముచే సిద్ధించునను నర్థమిచ్చెడి ప్రారంభశ్లోకము యొక్క ఉత్తరార్ధముతో విరోధమేర్పడుచున్నది. ఆయుత్తరార్ధమున గార్హస్థ్యముచేతను మోక్షమును సాధింప శక్యమని చెప్పబడినది. అందువలన మోక్షమునకు సాధకమను నంశముచే గార్హస్థ్యము చతుర్థాశ్రమముకంటెను జఘన్యమనుటకు శక్యము కాదు. ఇంతటితో గార్హస్థ్యమునకు ప్రాశస్త్యమును సమకూర్పనుపక్రమించి అప్రాశస్త్యమునే సాధించిన అనంతరామశాస్త్రులుగారు వినాయకుని చేయబోయి వానరకుని చేసిన న్యాయముచే మిక్కిలి పరిహాసపాత్రులైరి.

ద్వితీయ పరిహాసము ముగిసినది.

# తృతీయ పరిహాసము

ఇతో౽నన్తరామశాస్త్రిభిస్సిద్ధాన్తితయువతీవివాహవిషయవిచారః ప్రారభ్యతే యువతీవివాహసాధకే తత్కృతే గ్రన్థే ముక్తకణ్ఠమనువచనజాతవిశుద్ధైస్స్వకపోలకల్పితైః పరిహసనీయైర్వ్యాఖ్యానైర్యువతీవివాహస్య ౧. బ్రాహ్మాదివివాహానామపి కన్యానుమతిపూర్వకత్వస్య, ౨. తదనుకూలగాన్ధర్వవివాహే బ్రాహ్మణానామదృష్టవిరోధాభావస్య చ. ౩. మనోరభిమతత్వం పరికల్ప్య తాదృశమన్వభిమతవిరోధ్యర్థప్రతిపాదనాత్కలియుగముఖ్యానుష్ఠాపకపరాశరస్మృతేస్త్యాజ్యత్వం. ౪. సకలసమ్మతనిబన్ధనకారాణాం సర్వజ్ఞానాం వైద్యనాథదీక్షితానాం వార్ధక్యజన్యాపస్మారాద్యారోపణైరనాదరణీయత్వఞ్చోత్పాద్య ౫. యువతీవివాహస్సాధితః తదత్ర మనోరాధునికయుక్త్యాభాసైః కల్పితాభిమతనిరాసస్య ప్రాథమికత్వేన ప్రథమం తన్నిరాస ఏవ అస్మాకమావశ్యకః అతఆదౌ ముక్తకణ్ఠసిద్ధాన్తబోధకైః మనువచనజాతైః యువతీవివాహస్య మన్వనభిమతత్వం దర్శయిష్యామః.

తథాహి సకలస్మృతిమూలకర్తా మనుః పుంసాం ప్రాజ్ఞాభివర్ధనాద్దశమద్వాదశాన్యతరేహ్ని, చతుర్థే మాసి, షష్ఠే మాసి ప్రథమతృతీయాన్యతరే౽బ్దే, గర్భాష్టమే, షోడశే వర్షే చ, క్రమేణ జాతకర్మనామకరణగృహనిష్క్రమణాన్నప్రాశనచౌలోపనయనకేశాన్తాఖ్యం కర్మసప్తకమాదిశన్, స్త్రీణామపి మన్త్రసంస్కారమన్తరా తమేవ కాలమనువృత్య తత్కర్మసప్తకమాదిదేశ. తథాచ మనుః ద్వితీయాధ్యాయే ౬౬ శ్లోకః "అమన్త్రికా తు కార్యేయం స్త్రీణామావృదశేషతః, సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథావిధీ"తి అనేన స్త్రీణామప్యుపనయనే ప్రాప్తే తాసాం వివాహ ఏవ ఉపనయనమితి. పతిసేవాగృహకృత్యకర్మణీ ఏవ గురుకులవాసాగ్నిపరిక్రియాకర్మణీ ఇతి చ, తదవ్యవహితవచనేనైవ నిర్దిదేశ. "వైవాహికో విధిస్స్త్రీణాం సంస్కారో వైదికస్స్మృతః, పతిసేవా గురౌ వాసో గృహార్థో౽గ్నిపరిక్రియా." మనుస్మృతి అ 67 శ్లోకః. అస్య కుల్లూకభట్టీయవ్యాఖ్యానం వైవాహికఇతి వివాహ ఏవ స్త్రీణాం వైదికసంస్కారః ఉపనయనాఖ్యో మన్వాదిభిస్స్మృతః పతిసేవైవ గురుకులే వాసో వేదాధ్యయనరూపః గృహకృత్యమేవ సాయంప్రాతస్సమిద్ధోమరూపాగ్నిపరిచర్యా తస్మాద్వివాహాదేరుపనయనస్థానే విధానాదుపనయనాదేర్నివృత్తిరితి.

విజ్ఞానేశ్వరో౽పి స్త్రీణాం వివాహ ఏవోపనయనస్థానీయం కర్మేతి వ్యాజహార. తథాచ విజ్ఞానేశ్వరీయే, ఆచారకాణ్డే, బ్రహ్మచారిప్రకరణే, "ఉపనీయ గురుశ్శిష్యం మహావ్యాహృతిపూర్వకం. వేదమధ్యాపయేదేనం శౌచాచారాంశ్చ శిక్షయేది"తి. మూలవ్యాఖ్యానావసరే ఉపనీయ శౌచాచారాంశ్చ శిక్షయేత్యనేన ప్రాగుపనయనాత్కామ

చారో దర్శితః వర్ణిధర్మాన్ వర్జయిత్వా స్త్రీణామేతత్సమస్తం వివాహాదర్వాక్ ఉపనయనస్థానీయత్వాద్వివాహస్యేతి ఏవమేవ పితామహోపి "వివాహ ఏవోపనయః స్త్రీణాం వైదికఇష్యతే"తి వ్యాఘ్రపాదయమావపి మత పితామహమేవానుసృతౌ తథాచ వ్యాఘ్రపాదః "ఉపాయనోదితః కాలః స్త్రీణాముద్వాహకర్మణి, తస్మాదుపనయస్థానే వివాహం మనురబ్రవీత్". యమః. "వివాహం చోపనయనం స్త్రీణామాహ పితామహః" ఇతి.

ఇక అనంతరామశాస్త్రులచే సిద్ధాంతీకరింపబడిన యువతీవివాహమును గూర్చి విచారింతము.—అతని గ్రంథమునందు మనుస్మృతి వచనములకు విరుద్ధములై స్వకపోలకల్పితములయిన సరికాని యుక్తులచే (యువతీ వివాహము) బ్రాహ్మవివాహములకు కన్యయొక్క అనుమతి ఆవశ్యకత్వము. గాంధర్వవివాహము బ్రాహ్మణులకు సవకాశము. మనువున కభీష్టములని కల్పింపబడియున్నవి. పరాశరస్మృతి కలియుగమునందు ప్రమాణగ్రంథమైనను మనుస్మృతికి విరుద్ధముగ నుండుటవలన నద్యారి ఉపేక్షణీయమనియు అందరికిని సమ్మతములయిన గ్రంథములను రచించిన సర్వజ్ఞులగు వైద్యనాథదీక్షితులు వార్ధక్యముచే నేర్పడిన బుద్ధిభ్రంశము కలిగినవారగుటచే వారివచనములను నాదరింప తగదని కల్పించి యువతీవివాహము అతనిచే సాధింపబడియున్నది.

అందు అధునికములగు దుష్టయుక్తులచే యువతీవివాహమునకు మనువు సమ్మతిని కల్పించియుండుట ముందు నిరాకరణీయమైనయంశము గనుక మొదట ముక్తకంఠముగ సిద్ధాంతములను బోధించు వచనోక్తులచే యువతీవివాహము మనువునకు సమ్మతము కాదని నిరూపింపబోవుచున్నాను.

ఎట్లన—సకలస్మృతులకు మూలమయిన మనుస్మృతిని రచించిన మనువు పురుషులకు నాభిచ్ఛేదనమునకు ముందు దశమదివసమునందు ద్వాదశదివసమునందు ఫాల్గున మాసమునందు ఆఱవమాసమునందు మొదటి సంవత్సరమునందు మూడవ సంవత్సరమునందు గర్భాష్టమమునందు పదునారవసంవత్సరమునందు క్రమముగ జాతకర్మము నామకరణము ఇంటనుంచి బహిస్థలము చేయుట, అన్నప్రాశనము చౌలము ఉపనయనము కేశాంతమను నేడు సంస్కారములను ఆజ్ఞాపించి స్త్రీలకును మంత్రసంస్కారములేక ఆకాలముననే అనుసరించి యీసప్తవిధసంస్కారములను అనుష్ఠింపవలయునని ఉపదేశించెను. మ 1 ద్వి. అ. 66 శ్లోకమున వైశద్యముగ చెప్పబడియున్నది. ఈవచనముచే స్త్రీలకు ఉపనయనము ప్రసక్తము కాగా వారికి వివాహమే ఉపనయనమని పతిసేవయే గురుకులవాసమని గృహకృత్యనిర్వహణమే అగ్నిహోత్రోపాసనయని మ. ద్వి. అ. 67 శ్లోకమున ఉపదేశింపబడినది. ఈ అభిప్రాయమునే మనుస్మృతి వ్యాఖ్యాతయగు కుల్లూకభట్టుడు వివరించియున్నాడు.

విజ్ఞానేశ్వరీయమున ఆచారకాండమున బ్రహ్మచారి ప్రకరణమునం దీ విషయమును నిరూపించియున్నాడు. ఈ విధముగనే పితామహుడును, వ్యాఘ్రపాదుడును, యముడును సూక్తిని సమర్థించియున్నారు.

గర్భాష్టమమే స్త్రీలకు వివాహకాలమైనచో బ్రాహ్మణు లనుష్ఠించు శిశువివాహము లెట్లు యుక్తములగునని యాశంకింపరాదు. శాస్త్రీయమగు వరుడు లభించినపుడు గర్భాష్టమముగకంటె ముందుకూడ కామ్యకాలమని మనువు ఉపదేశించియున్నాడు.

తథాచ మనుః నవమాధ్యాయే 88 శ్లోకః. "ఉత్కృష్టాయాభిరూపాయ వరాయ సదృశాయ చ, అప్రాప్తామపి తాం తస్మై కన్యాం దద్యాద్యథావిధి" ఇతి అస్య కుల్లూకభట్టీయ వ్యాఖ్యానం ఉత్కృష్టాయేతి కులాచారాదిభిరుత్కృష్టాయ సురూపాయ సమానజాతీయాయ వరాయ అప్రాప్తకాలామపి వివాహాయే దష్టవర్షామేవం ధర్మ్యో న హీయత ఇతి దక్షస్మరణాత్తస్మాదపి కాలాత్ప్రాగపి కన్యాం బ్రాహ్మవివాహవిధినా దద్యాదితి అస్య కామ్యోపదేశస్య బోధాయనవసిష్ఠవచనైరుపబృంహితత్వాచ్చ బోధాయనః "దద్యాద్గుణవతే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే." వసిష్ఠః "ప్రయచ్ఛేన్నగ్నికాం కన్యాం ఋతుకాలభయాత్పి" తేతి నగ్నికా లక్షణమపి తేనైవోక్తమ్ "యావన్నలజ్జితాఙ్గాని కన్యా పురుషసన్నిధౌ, యోన్యాదీన్యవగూహేత తావద్భవతి నగ్నికేతి."

మ. 9 అ. 88 శ్లోకము. గాన దక్షప్రజాపతియు నీవిషయమునే నిరూపించియున్నారు. ఈ కామ్యకాలమును బోధాయన వసిష్ఠులు బలపరచియున్నారు.

నచాషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తత ఇతి పురుషాణామివ స్త్రీణాముపనయనస్థానీయవివాహస్య గౌణకాలోఽప్యస్త్వితి వాచ్యమ్, తాసాముపనయనగౌణకాలప్రతినిధితయా ఋతుదర్శనపర్యన్తస్యైవ కాలస్య వివాహయోగ్యత్వేన మనునైవోపదిష్టత్వాత్. తథాచ మనుః. 8 అధ్యాయే 226 శ్లోకః. "పాణిగ్రహణికా మన్త్రాః కన్యాస్వేవ ప్రతిష్ఠితాః." అస్య కుల్లూకభట్టీయవ్యాఖ్యానం. పాణిగ్రహణికా ఇతి. అర్యమణం ను దేవం కన్యా అగ్నిమయక్షతేత్యేవమాదయో వైవాహికా మనుష్యాణాం మన్త్రాః కన్యాశబ్దశ్రవణాత్కన్యాస్వేవ వ్యవస్థితా ఇతి. మనువచనస్యాస్య గౌతమవైశేసీయమసంవర్తైరుపబృంహితత్వాచ్చ తథాచ గౌతమః 'ప్రదానం ప్రాగృతో'రితి వైశేసిః 'యావన్నోద్భిద్యేతే స్తనౌ తావదేవ దేయే'తి యమసంవర్తౌ చ 'తస్మాద్వివాహయేత్కన్యాం యావన్నర్తుమతీ భవే'దితి.

పదునారు సంవత్సరముల వయస్సువరకును బ్రాహ్మణునకు సావిత్రి పతితము కాదను నాపస్తంబుల వచనము ననుసరించి పురుషులకువలె స్త్రీలకును ఉపనయన స్థానీయమైన వివాహమునకు గౌణకాలమైన పదునారు సంవత్సరము లవధిగ నుండవచ్చునని శంకింపరాదు. స్త్రీలకు నుపనయన గౌణకాలమునకు బదులుగ ఋతుదర్శన పర్యంత కాలము వివాహగౌణకాలముగ మనువుచే నుపదేశింపబడినది. మ. 8 అ. 226 శ్లోకము. ఈమనువచనము గౌతమవైశేసి యమసంవర్తులచే బలపరచబడియున్నది.

న హి కన్యాశబ్దస్యార్థాన్తరం ప్రకల్ప్యత ఇతి వాచ్యమ్. ప్రశ్నపరిహాస ఏవ నవైకన్యేతి మనువచనేన తస్య దత్తోత్తరత్వాత్.

కన్యాశబ్దమునకు అర్థాంతరము కల్పించుటకు శక్యము కాదు. ప్రథమ పరిహారము నందే 'నవైకన్యా' యనే మనువచనముచే నది నిరాకరింపబడినది.

8-వ పేరా,

న హి మనునా యువతీవివాహస్యానిషిద్ధత్వాత్, తత్కరణే కో వా ప్రత్యవాయ ఇతి వాచ్యమ్. పూర్వోదాహృతమనువచనోత్తరార్థేన నిషిద్ధత్వాత్. మ. 8అ 226 శ్లో. "నాకన్యాసు క్వచిన్నౄణాం లుప్తధర్మక్రియా హి తాః" అస్య కుల్లూకభట్టవ్యాఖ్యానమ్. నాకన్యావిషయే క్వచిచ్ఛాస్త్రే ధర్మ్యవివాహసిద్ధయే వ్యవస్థితా అసమవేతార్థాస్స్యుః. అకన్యా హి తాః క్షతయోనయో వైవాహికమన్త్రసంస్క్రియమాణా అపి యస్మాదపగత ధర్మవివాహాదికాలినో భవన్తి నాసౌ ధర్మ్యో వివాహ ఇత్యర్థః. మనువిహితనిషేధస్యాస్య బోధాయనఆపస్తంభవైఖానసవసిష్ఠసంవర్తైశ్చైరుపబృంహితత్వాచ్చ బోధాయనః "అపి వా గుణహీనాయ నోపరుంధ్యాద్రజస్వలా" మితి, ఆపస్తంబః "అనుద్వాహితా తు యా కన్యా ఆర్తవే నియుజ్యతే. సా వృషలీ," వైఖానసః "అథ ఋతుమతీ భవతి దాతా ప్రతిగృహీతా చ నరకమాప్నోతి, పితృపితామహప్రపితామహాశ్చ విష్ఠాయాం జాయన్తే, తస్మాన్నగ్నికా దాతవ్యేతి" వసిష్ఠః, "ఋతుమత్యాం హి తిష్ఠంత్యాం దోషః పితరమృచ్ఛతి." సంవర్తః, "ప్రాప్తే తు ద్వాదశే వర్షే యః కన్యాం న ప్రయచ్ఛతి, మాసి మాసి రజస్తస్యాః పితా పిబతి శోణిత"మితి. ముఖ్యకాలఏవ కన్యాయా అదాతుః పితుర్వాచ్యత్వస్య యః కో వా కన్యామకన్యేతి ద్వేషేణ బ్రూయాత్తస్య దణ్డ్యత్వస్య చ మనునైవోక్తత్వాచ్చ తథాచ మనుః. నవమాధ్యాయే ౪ శ్లోకః. "కాలేఽదాతా పితా వాచ్యో వాచ్యశ్చానుపయన్ పతిః." అస్య కుల్లూకభట్టీయవ్యాఖ్యానం. కాలఇతి ప్రదానకాలే పితా కామదదన్గర్హ్యో భవతి ప్రదానం ప్రాగృతోరితి గౌతమస్మరణాదృతోః ప్రాక్ప్రదానకాలఇతి. అస్య యాజ్ఞవల్క్యబృహస్పత్యుపబృంహితత్వమపి. తథాచ యాజ్ఞవల్క్యః ఆచారకాణ్డే వివాహప్రకరణే "అప్రయచ్ఛన్సమాప్నోతి భ్రూణహత్యామృతావృతౌ" ఇతి. తథాచ బృహస్పతిః. "అప్రయచ్ఛన్పితా కాలే పతిశ్చానుపయన్నృతౌ పుత్రశ్చాభర్తృదో మాతుర్దుష్టా దణ్డ్యాశ్చ ధర్మతః" ఇతి. కన్యామకన్యేతి వదతో దణ్డ్యత్వం తథాచ మనుః. 8 అష్టమాధ్యాయే 225 శ్లోకః "అకన్యేతి యః కన్యాం బ్రూయాద్ద్వేషేణ మానవః. స శతం ప్రాప్నుయాద్దండం తస్యాదోషమదర్శయన్." అస్య కుల్లూకభట్టీయవ్యాఖ్యానం అకన్యేతి నేయం కన్యా క్షతయోనిరితి యో మనుష్యో ద్వేషేణ బ్రూయాత్తస్య ఉక్తదోష మప్రభావయన్ పణశతం రాజా దణ్డం ప్రకల్పయేత్ యుక్తశ్చాస్యాకన్యేతి వాదినో దణ్డో యస్మాదితి,

మనువు యువతీవివాహమును నిషేధించనందువలన దానిం జేసిన ననర్థమేమియని శంకింపరాదు. ముం దుదహరింపబడిన మనువచన ఉత్తరార్థముచే నిషేధింపబడియున్నది. మ, 8 అ. 226 శ్లోకము. పాణిగ్రహణ మంత్రములన్నియు కన్యలయందే ప్రతిష్ఠింపబడియున్నవి. కన్యలు గానివారు ధర్మము లేనివారు కాబట్టి వారివిషయమున నా మంత్రములకు ప్రయోగము లేదు దీనికి కుల్లూకభట్టీయవ్యాఖ్యానము. కన్యాభిన్నుల

అని ఉపక్రమించి మను. 9 అ. 55 శ్లోకము వరకును స్త్రీపురుషధర్మములను చెప్పి మను. 9 అ. 56 శ్లోకము. ఇక ఆపత్తునందు స్త్రీలకు ధర్మములను చెప్పబోవుచున్నానని ఉపక్రమించి మను. 9 అ. 103 శ్లో. "స్త్రీపురుషులకు గతిసహితమైన ధర్మము ఆపద యందు పుత్రప్రాప్తిమార్గము చెప్పబడినది" అను శ్లోకము వరకు స్త్రీలకు మనువు ఆపద్ధర్మములను చెప్పెను. ఈవచనము సావధానము అంతర్గతమై యుండుటవలన నిదియు నాపద్ధర్మమే.

11-వ పేరా. అనాపద్యాపద్ధర్మానుష్ఠానే కిమ్మానమితి వాచ్యమ్. ఆపద్ధర్మాణామనాపద్యాచరణే ఫలాభావబోధకమనువచనానాం జాగరూకత్వాత్ తథాచ మనుః 11 అ. 28, 29, 30 శ్లో॥ "ఆపత్కల్పేన యో ధర్మం కురుతే౽నాపది ద్విజః స నాప్నోతి ఫలం తస్య పరత్రేతి విచారితమ్. విశ్వైశ్చ దేవైస్సాధ్యైశ్చ బ్రాహ్మణైశ్చ మహర్షిభిః. ఆపత్సు మరణాద్భీతైః విధేః ప్రతినిధిః కృతః. ప్రభుః ప్రథమకల్పస్య యోనుకల్పేన వర్తతే, న సాంపరాయికం తస్య దుర్మతేర్విద్యతే ఫలమిత్యాది

11-వ పేరా. ఆపద్ధర్మ మాచరింపవలదనుటకు ప్రమాణమేమియని శంకింపరాదు. ఆపదలేనియపుడు ఆపద్ధర్మము నాచరించిన ఫలము లేదని మనువచనములు తెల్పుచున్నవి. మను. 11 అ. 28 శ్లోకం 29 శ్లోకం 30 శ్లోకములు "ఆపద లేనియపుడు ద్విజుడు ఆపద్ధర్మము నాచరించినచో దానిఫలమును పరలోకమున పొందడని నిశ్చయింపబడినది. విశ్వేదేవులచేతను, సాధ్యులచేతను, మహర్షులచేతను, బ్రాహ్మణులచేతను మరణభీతిచే ఆపదలయందు ముఖ్యవిధియగు సోమయాగాదులకు వైశ్వానరి మొదలగు ఇష్టులు ప్రతినిధులుగ చేయబడినవి ముఖ్యకల్పమును చేయుటకు శక్తికలిగినవాడయ్యును ఆపత్కల్పముచే అనుష్ఠానము చేసినచో నట్టి దుర్బుద్ధిగలవానికి పారలౌకికమగు అభ్యుదయ ఫలము సంభవింపదు' అని.

12-వ పేరా. న చ ఆపద్ధర్మాణామనాపద్యాచరణే ఫలాభావేఽపికో దోష ఇతి వాచ్యమ్. స్వేభ్యః కర్మభ్యః అనాపదిచ్యుతా వర్ణాః పాపిష్ఠాభవన్తీతి మనునైవనిషిద్ధత్వాత్. తథాచమనుః ౧౨ అధ్యాయే. ౭౦ శ్లో. "స్వేభ్యస్స్వేభ్యస్తుకర్మభ్యశ్చ్యుతావర్ణాహ్యనాపది, పాపాన్ సంసృత్యసంసారాన్ ప్రేష్యతాం యాన్తి శత్రుషు. ౭౧ శ్లోకః వాన్తాశ్యుల్కాముఖః ప్రేతో విప్రోధర్మాత్స్వకాచ్చ్యుత ఇత్యాది వామదేవాదిభిరాపద్యను ష్ఠితశ్వమాంసాదిభక్షణాదేరనాపద్యప్యాదరణీయత్వాపత్తేశ్చ. తథాచమనుః ౧౦ అ. ౧౦౬ శ్లో. "శ్వమాంసమిచ్ఛన్నార్తోఽత్తుం ధర్మాధర్మవిచక్షణః. ప్రాణానాం పరిరక్షార్థం వామదేవోనలిప్తవాన్. ౧౦౭ శ్లో. భరద్వాజః క్షుధార్తస్తు సపుత్రో విజనే వనే. బహ్వీర్గాః ప్రతిజగ్రాహ వృధోస్తక్ష్ణో మహాతపాః ౧౦౮ శ్లో. క్షుధార్తశ్చాత్తుమభ్యాగాద్విశ్వామిత్రశ్శ్వజాఘనీం. చణ్డాలహస్తాదాదాయధర్మాధర్మవిచక్షణ ఇత్యాది.

12-వ పేరా. ఆపద్ధర్మములను ఆపదలేనియపుడు ఆచరించినచో ఫలము లేక పోయినను దోషమేమియని శంకింపరాదు. ఆపదలేనియపుడు తమకర్మలనుండి భ్రష్టు

# చతుర్థః పరిహాసః

అథేదానీం బ్రాహ్మేవి వివాహేష్వపి కన్యానుమతే రావశ్యకత్వసాధకయుక్త్యాభాసైః కల్పితమస్మదభిమతనిరాసస్య అవసరప్రాప్తత్వాదిహానువచనైరేవ తదనభిమతత్వం దర్శయిష్యామః.

1-వ పేరా. తథాహి పితా వా తదనుమత్యా భ్రాతా వా యస్మై దద్యాత్స గుణహీనోఽపి దేవవచ్ఛ్రుతం సేవ్య ఇతి. స్త్రీణాం బాల్యాద్యవస్థాత్రయేప్యస్వాతన్త్ర్యమేవేతి చ మనుర్ముక్తకణ్ఠమవాదీత్. తథాచ మనుః. 5 అధ్యాయే స్త్రీధర్మనిర్ణయే. 151 శ్లో. "యస్మై దద్యాత్పితా త్వేనాం భ్రాతా వానుమతే పితుః, తం శుశ్రూషేత జీవన్తం సంస్థితం చ న లఙ్ఘయేత్." 154 శ్లో. "విశీలః కామవృత్తో వా గుణైర్వా పరివర్జితః. ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవవత్పతిః." 147 శ్లో. బాలయా వా యువత్యా వా వృద్ధయా వాపి యోషితా. న స్వాతన్త్ర్యేణ కర్తవ్యం కించిత్కార్యం గృహేష్వపీతి.

1-వ పేరా. నాల్గవ పరిహాసమునకు తెనుగు. ఎట్లన: తండ్రిగాని తండ్రి అనుమతి ననుసరించి సోదరుడుగాని నెవ్వనికి దానము చేయునో వాడు గుణహీనుడైనను దేవునివలె నెల్లప్పుడును సేవింపదగినవాడు అని స్త్రీలకు బాల్యము మున్నగు మూడుదశల యందును స్వాతంత్ర్యము లేదని మనువు ముక్తకంఠుడై పలికెను. మనుస్మృతి 5 అ. 151 శ్లో. "తండ్రి లేక తండ్రి అనుమతిచే సోదరుడు ఈమెను ఎవనికి దానము చేయునో వానిని జీవించియున్నంతవరకు సేవింపవలయును. అతడు గతించినను పాతివ్రత్యము నుల్లంఘించరాదు." మనువు. 5 అ. 154 శ్లో. "శీలము లేనివాడైనను స్వేచ్ఛాసంచారము కలిగినవాడైనను గుణహీనుడైనను భర్త దేవునివలె పతివ్రతయగు స్త్రీచే పరిచర్య చేయదగినవాడు." మ. 5 అ. 147 శ్లో. "బాలిక చేతను యువతి చేతను లేక వృద్ధురాలి చేతనుగాని గృహములయందు నేపనియు స్వతంత్రముగ చేయదగినది కాదు.

2-వ పేరా. న చ "కన్యాయాం దత్తశుల్కాయాం మ్రియేత యది శుల్కదః. దేవరాయ ప్రదాతవ్యా యది కన్యానుమన్యతే" ఇత్యనేన క్రీతతుల్యాయా అపి కన్యాయా అనుమతిపూర్వికస్యైవ దానస్య విహితత్వాద్బ్రాహ్మేవివాహేష్వపి కన్యానుమతిపూర్వకమేవ దాతవ్యేతి గమ్యత ఇతి వాచ్యమ్. వాచ్యార్థాపేక్షయా గమ్యమానార్థస్యాతీవదౌర్బల్యాత్. ఆపద్ధర్మేషు మృతభర్తృకాయా దేవరాదినియోగవిషయే విశేషతయా విహితాయాః కన్యానుమతేః సామాన్యతో విహితబ్రాహ్మాది వివాహేషు ప్రవేశాభావాచ్చ. "యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః తామనేన విధానేన నిజో విన్దేత దేవరః." ఇతి ప్రాగుక్తనియోగరూపమిదం శుల్కగ్రహణవిషయమితి కుల్లూకభట్టేనాపి వ్యాఖ్యాతమ్;

2-వ పేరా. కన్యకు శుల్కమొసంగినవెనుక శుల్కమిచ్చిన వరుడు గతించినచో కన్య అంగీకరించుపక్షమున దేవరునకు (మరదికి) ఆకన్య దానము చేయదగినది అను వచనముచే క్రీతప్రాయురాలగు (ఇంచుమించు కొనబడిన) కన్యకుగూడా ఆమె అనుమతితోనే దానము చేయవలసినట్లు విధించుటవలన బ్రాహ్మాదివివాహములయందును కన్యయొక్కయనుమతితోనే దానము చేయవలయునని సూచింపబడినట్లు శంకింపరాదు. వాచ్యార్థముకంటె సూచ్యార్థములు మిక్కిలి దుర్బలములు. ఆపద్ధర్మములయందు మృతభర్తృకయగు కన్యను దేవరాదులకు నియోగించువిషయమున విశేషముగ విధింపబడిన కన్యానుమతికి సామాన్యవిహితములగు బ్రాహ్మాది వివాహములయందు ప్రవేశము లేదు. వాక్కుచేత సత్యము చేయబడినపిదప కన్యయొక్కభర్త గతించినచో ఆమెను ఈవిధితోనే మరది పొందవలయును. అని ముందుచెప్పబడిన నియోగరూపమైన ఈవచనము శుల్కగ్రహణవిషయమని కుల్లూకభట్టుని చేతనూ వ్యాఖ్యానింపబడినది.

2-వ పేరా. ఇత్థం చాపద్ధర్మేషు శుల్కదే వివాహో దర్వాఙ్మృతేసతి ప్రాప్తవైధవ్యాయాః కన్యాయాః దేవరాదినియోగవిషయక కన్యాయాం దత్తశుల్కాయా మిత్యత్ర విహితకన్యానుమతిస్సర్వేషాం వివాహానామప్యావశ్యకీతి జానన్తోఽనన్తరామశాస్త్రిణః అపత్యాదిహీనసచ్ఛ్రోత్రియాది మృతశరీరవిషయకమనాథప్రేతసంస్కారాత్కోటియజ్ఞఫలం లభేదిత్యేతద్వచనం పశ్వాదిజన్తు సామాన్యవిషయకమితి మత్వా క్వచిన్నిపతితమృతగర్దభకళేబరదహనాయ యతమానః పరమానన్దాన్తేవాసీ వక్రబుద్ధిరివ సర్వోపహాస్యతాభాణ్డాగారమభూవన్.

సమాప్తోయం చతుర్థః పరిహాసః.

2-వ పేరా. ఇవ్విధముగ ఆపద్ధర్మములయందు వివాహమునకుముందు శుల్కమిచ్చినవాడు గతించినచో వైధవ్యమును పొందినకన్యకు "దేవరుడు మున్నగువారి నియోగమునకు విషయమగు కన్య దత్త శుల్కాకాగా" అనునెడ విధింపబడిన కన్యానుమతి వివాహము లన్నింటికి ఆవశ్యకమని తెలిసికొను శ్రీ అనంతరామశాస్త్రులుగారు బిడ్డలులేని సద్వైదికుని మృతశరీరమును విషయీకరించిన "అనాథప్రేతసంస్కారమువలన కోటియజ్ఞఫలమును పొందును" నీ వచనమును పశ్వాదిజంతుసాధారణముగ భావించి యొకచోట మృతిజెందిన గర్దభకళేబరమును దహనము జేయుటకు ప్రయత్నించు వక్రబుద్ధియగు పరమానందయ్య శిష్యునివలె పరిహాసమునకు స్థానమాయెను.

నాల్గవపరిహాసము సమాప్తము.

# పఞ్చమః పరిహాసః

అథేదానీం బ్రాహ్మణానాం గాన్ధర్వవివాహస్య
మన్వనభిమతత్వం దర్శయిష్యామః.

1-వ పేరా. బ్రాహ్మదైవార్షప్రాజాపత్యాసురగాన్ధర్వరాక్షస పైశాచాఖ్యేషు వివాహేష్వాద్యషట్కస్య ధర్మ్యత్వం కైశ్చిదఙ్గీకృతమ్. కైశ్చిదాద్యచతుష్టయస్యైవ. ఏవం పక్షద్వయమనూద్యమనుర్ద్వితీయ పక్షవాదినాం (కవయ ఇతి) విశేషణ దానేన తస్యైవ స్వాభిమతత్వం దర్శయామాస. తథాచ మనుః తృతీయాధ్యాయే 23-24 శ్లో. షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోవరాన్, విట్శూద్రయోస్తు తానేవ విద్యాద్ధర్మ్యాన్నరాక్షసాన్. చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదురితి. ఏవమేవ గౌతమోపి చత్వారో ధర్మ్యాః ప్రథమాః షడిత్యేకేతి.

1-వ పేరా. ఇక బ్రాహ్మణులకు గాంధర్వవివాహము మనువునకు అనభిమతమని నిరూపింపబోవుచున్నాము. బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచ, నామకములగు వివాహములయందు మొదటి యారును ధర్మబద్ధములని కొందరంగీకరించిరి. మరికొందరు మొదటి నాలుగే ధర్మబద్ధములని అంగీకరించిరి. ఇట్లు రెండుపక్షములను అనువదించి మనువు ద్వితీయపక్షవాదులను "కవులని" విశేషణముచే విశేషించుటవలన ఆపక్షమే తనకభిమతమని చూపెను. మ. 3 అ. 23 శ్లో. 24 శ్లో "బ్రాహ్మణునకు క్రమముగ బ్రాహ్మాదివివాహము లారును, క్షత్రియునకు ఆసురాది వివాహము లారును, విట్శూద్రులకు రాక్షసవివాహమును వర్జించి ఆసుర, గాంధర్వ, పైశాచ, వివాహములును ధర్మ్యములని తెలియవలయును. "బ్రాహ్మణునకు మొదటి నాలుగు ప్రశస్తములని జ్ఞానులు తెలిసికొని యున్నారు. గౌతముడు "మొదటి నాలుగును ధర్మ్యములు, మొదటి ఆరుకూడ ధర్మ్యములని ఇతరులు" అని చెప్పియున్నాడు.

2-వ పేరా. న చ కవయో విదురిత్యనేన ద్వితీయస్య మతాన్తరత్వమస్తు షడానుపూర్వ్యేత్యత్ర లిఙా విధ్యర్థకేనో పదిష్టత్వాత్కథం తస్య మతాన్తరత్వం పరికల్ప్యత ఇతి వాచ్యమ్; ఆద్యషట్కాన్తర్గతాసురగాన్ధర్వయోర్నిషిద్ధత్వాత్. తథాచ మనుః 3 అధ్యాయే. 25 శ్లోకః. పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన. మ 3 అ. 35 శ్లోకః. అద్భిరేవ ద్విజాగ్ర్యాణాం కన్యాదానం విశిష్యతే. ఇతరేషాంతు వర్ణానా మితరేతరకామ్యయేతి.

కించాసుర గాన్ధర్వ రాక్షస పైశాచానాం నిన్ద్యత్వస్య తదుత్పన్న ప్రజానాం దుర్గుణత్వస్య తేషాం త్యాజ్యత్వస్య కులభ్రంశకరత్వస్యచ, మనునైవోక్తత్వాత్ తథాచ

మను. 3 అ. 41 శ్లో. ఇతరేషు తు శిష్టేషు నృశంసాఽనృతవాదినః. జాయన్తే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః. నిన్దితై ర్నిన్దితా నృణాం తస్మాన్నిన్ద్యాన్వివర్జయేత్. మ. 3-63 శ్లో. కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేనచ. కులాన్యకులతాం యాన్తి బ్రాహ్మణాతిక్రమేణచేతి.

2-వ పేరా. "కపులు తెలిసికొనుచున్నారు" అనువచనముచే రెండవది మతాంతరమగుచో కానిమ్ము "షడానుపూర్వ్యా" అనుచోట విప్రునకు లిజ్‌చే ఉపదేశింపబడియున్నది. కాబట్టి అది మతాంతరమగుట యెట్లుచెల్లునని యాశంకింపరాదు. అన్యషట్కమునందుచేరిన ఆసురగాంధర్వములు విశేషింపబడియున్నవి. మ. 3 అ. 25 శ్లో. "పైశాచము, రాక్షసము, యెన్నటికిని చేయరాదు." మ. 3 అ. 35 శ్లో. "బ్రాహ్మణునకు ఉదకపూర్వకముగనే కన్యాదానము ప్రశస్తము ఇతరవర్ణస్థులకు పరస్పరేచ్ఛచే కన్యాదానము యుక్తమగుచున్నది."

మరియు ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములు నింద్యములుగను వానివలన నేర్పడినసంతతి గుణహీనమైనదిగను, త్యజింపదగినదిగను, కులక్షయకరమైనదిగను మనువుచేతనే చెప్పబడినది. మ. 3 అ. 41 శ్లో. 'బ్రాహ్మాదివివాహచతుష్టయమునకంటె భిన్నములగు దుష్టవివాహములయందు క్రూరులును అసత్యవాదులు వేదవిద్వేషులును ధర్మద్వేషులునగు పుత్రులు పుట్టుచున్నారు. నిందితవివాహములచే మనుష్యులకు నిందితసంతతి యేర్పడుచున్నది." అందువలన నిందితవివాహములను వర్జింపవలయును. మ. 3 అ. 63 శ్లో. "నిషిద్ధములైన ఆసురాది వివాహములచేతను, జాతకర్మాది కర్మలోపముచేతను, వేదాధ్యయనము లేకపోవుటచేతను, బ్రాహ్మణపూజ లేకపోవుటచేతను, సత్కులములు దుష్కులము లగుచున్నవి"

3-వ పేరా. నచ శిష్టేష్విత్యనేన అసురగాన్ధర్వరాక్షసపైశాచాః కథం గృహ్యన్త ఇతి వాచ్యమ్. బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః, బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయన్తే శిష్టసమ్మతాః. ఇతరేషు తు శిష్టేషు నృశంసా నృతవాదినః జాయన్తే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః. ఇత్యత్ర ప్రథమశ్లోకే బ్రాహ్మాదిష్వానుపూర్వశ శ్చతుర్ష్విత్యనేన బ్రాహ్మదైవార్ష ప్రాజాపత్యేషు గృహీతేషు సత్సు ద్వితీయశ్లోకే ఇతరేషుతు శిష్టేష్విత్యనేనోక్త వ్యతిరిక్తా నామాసురగాన్ధర్వరాక్షస పైశాచానామేవ గ్రాహ్యత్వాత్.

3-వ పేరా. "శిష్టేషు" అనుటచే ఆసుర, గాంధర్వ, పైశాచములే గ్రాహ్యములనుటకు ప్రమాణమేమని శంకింపరాదు. మ. 3 అ. 39 శ్లో. "క్రమముగ బ్రాహ్మాది చతుర్వివాహముల యందును బ్రహ్మవర్చస్సుగలిగిన శిష్టులకు ప్రియమైన పుత్రులు జనించుచున్నారు. మిగిలిన ఇతర వివాహములయందు క్రూరులును, అసత్యవాదులు, వేదధర్మవిద్వేషులునగు పుత్రులు జన్మించుచున్నారు." అనుచోట మొదటిశ్లోకమునందు

క్రమముగ బ్రాహ్మాదివివాహచతుష్టయమునందు అనుటచే బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములు గ్రహింపబడగా రెండవశ్లోకమునందు "మిగిలిన ఇతరవివాహములయందు" అనువచనముచే చెప్పబడినవానికంటె భిన్నములగు అసుర, గాంధర్వ, పైశాచములే గ్రహింపదగియున్నవి.

4-వ పేరా. నచాసుర గన్ధర్వ రాక్షస పైశాచ విధివివాహితాసూత్పన్నానాం నృశంసానృతవాదిత్వాదికథనాత్తాదృశ వివాహోచితానాం క్షత్రియవిట్శూద్రాణాం సపుత్రాభావాపత్తిరితి వాచ్యమ్. నృశంసత్వాదికథనస్య బ్రాహ్మణానామధర్మ్యత్వేనోపదిష్టాసురాదివిధివివాహితాసు బ్రాహ్మణైరుత్పాదితప్రజామాత్రవిషయత్వాత్. బ్రాహ్మణానామధర్మ్యవిధివివాహితాసూత్పన్నానాం నిర్దిష్టనృశంసత్వాదికథనస్య క్షత్రియాదేర్ధర్మ్యత్వేనోపదిష్టాసురాదివిధివివాహితోత్పన్నానాం వక్తుమశక్యత్వాచ్చ. అన్యథా. మ. 3 అ. 22 శ్లో. యో యస్య ధర్మ్యో వర్ణస్య గుణదోషౌచ యస్య యౌ. తద్వస్సర్వం ప్రవక్ష్యామి ప్రసవే చ గుణాగుణాన్. ఇత్యుపక్రమవ్యాఘాతాపత్తిః.

4-వ పేరా. అసుర గాంధర్వ పైశాచాదులచే వివాహమాడబడిన స్త్రీలయందు జనించిన సంతతి క్రూరము, అసత్యవాదిగా నుండుననుటచే అట్టివివాహములకు నర్హులగు క్షత్రియ విట్శూద్రులకు సత్పుత్రు లుండకపోవలసివచ్చునుగదా యని శంకింపరాదు. బ్రాహ్మణులకు అధర్మ్యములుగా చెప్పబడిన అసురాదివిధులచే వివాహితలగు స్త్రీలయందు బ్రాహ్మణులకు జనించిన సంతతికే క్రూరత్వము, అసత్యవాదిత్వము మున్నగుదోషములు ఏర్పడును. ఇతరులవిషయమున కిది అన్వయింపదు. బ్రాహ్మణులకు అధర్మ్యవిధులచే వివాహమాడబడిన స్త్రీలయందు ఉత్పన్నమైన సంతతికి చెప్పబడిన దోషములు క్షత్రియాదులకు ధర్మ్యములుగా చెప్పబడిన అసురాదివిధులచే వివాహమాడబడిన స్త్రీలయందు నుత్పన్నమగు సంతతికిగూడ నన్వయించునని చెప్పుటకు శక్యము కాదు. అట్లు కానిచో మ. 3 అ. 22 శ్లో. "ఏవర్ణములకు ఏది ధర్మబద్ధమో ఏవర్ణమునకు ఏవి గుణదోషములో వానినంతయును, ఆవివాహములవలన జనించిన సంతతియొక్క గుణాగుణములను చెప్పబోవుచున్నాను" అను నుపక్రమమునకు భంగమేర్పడవలసి వచ్చును.

5-వ పేరా. న చ చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదురితి మతాన్తరస్య మనోస్స్వాభిమతత్వం కథం కల్ప్యత ఇతి వాచ్యమ్. కవయ ఇతి విశేషణదానేనేతి దత్తోత్తరత్వాత్. కించ బ్రాహ్మదైవార్షప్రాజాపత్యైర్వివాహితాసూత్పన్నానామేవ పుత్రాణాం బ్రాహ్మణస్యావశ్యకపితౄణవిమోచకత్వస్య ప్రతిపాతత్వాత్. తథాచ మనుః తస్మిన్నేవాధ్యాయే 37-38 శ్లో. దశ పూర్వాన్ పరాన్ వంశ్యానాత్మానం చైకవింశకమ్, బ్రాహ్మీపుత్రస్సుకృతకృన్మోచయేదేనసః పితౄన్. దైవోఢాజ

స్సుతశ్చైవ సప్తసప్తపరావరాన్. ఆర్షోఢాజస్సుతస్త్రీంస్త్రీన్ షట్ షట్ కాయోఢజస్సుతః.

5-వ పేరా. "మొదటి నాలుగువివాహములును బ్రాహ్మణునికి ప్రశస్తములని కవులు (కవులు=జ్ఞానులు) తెలిసికొనుచున్నారు" అను మతాంతరమును మనువున కనభిమతమని కల్పించుటకు యోగ్యమని శంకింపరాదు. "కవయః" అను విశేషణము చేతనే ఆప్రశ్నకు ఉత్తరమీయబడియున్నది. మరియు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములచే వివాహితులగువారియందు జన్మించినపుత్రులే బ్రాహ్మణునకు పితరులయొక్క ఋణమును తీర్పగలిగినవారని ప్రతిపాదింపబడియున్నది. మ. 3. అ. 37-38. శ్లో. 'బ్రాహ్మవివాహముచే వివాహమాడబడిన స్త్రీయందు జన్మించినపుత్రుడు సత్కర్మపరుడైనచో తండ్రి మొదలుకొని పదితరములవారిని పుత్రుడు మొదలుకొని పదితరములవారిని తన్ను మొత్తము ఇరువదియొక్కసంఖ్య కలిగినవ్యక్తులను పాపమునుండి విడిపించుచున్నాడు. దైవవివాహముచే నూఢయగు స్త్రీయందుత్పన్నుడైన పుత్రుడు తండ్రి నారంభించి యేడుగురిని పుత్రుని ఆరంభించి యేడుగురిని ఆర్షవివాహముచే నూఢయగు స్త్రీయందుత్పన్నమైనవాడు తండ్రిని ఆరంభించి ముగ్గురిని పుత్రుని ఆరంభించి ముగ్గురిని ప్రాజాపత్యవివాహముచే నూఢయగుదానియందుత్పన్నుడైన పుత్రుడు తండ్రి నారంభించి ఆరుగురిని పుత్రుని ఆరంభించి ఆరుగురిని తన్ను పాపమునుండి విమోచనము చేయుచున్నాడు."

6-వ పేరా. న చ గాన్ధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య తౌ స్మృతౌ. ఆసురం వైశ్యశూద్రయోః. ఇతి క్షత్రియవైశ్యశూద్రాణాం గాన్ధర్వరాక్షసాసుర వివాహానాం ధర్మ్యత్వేనోపదిష్టత్వాత్తేషాం పిత్ర్యాణవిమోచకత్వాభావాపత్తిరితి వాచ్యమ్. జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిరృణవాన్ జాయతే ఇతి శ్రుత్యా బ్రాహ్మణానామేవ ఋణత్రయస్య ప్రతిపాదితత్వాత్తన్మోచకపుత్రాణాం తేషామేవావశ్యకత్వాత్తదితర క్షత్రియవిట్ఛూద్రాణాం పిత్ర్యాణవిమోచకత్వాభావస్యేష్టాపత్తేః.

6-వ పేరా. క్షత్రియులకు గాంధర్వరాక్షసములు ధర్మ్యములుగ చెప్పబడినవి. ఆసురము వైశ్య, శూద్రులకు ధర్మ్యముగ చెప్పబడినది. గాన క్షత్రియ, వైశ్య, శూద్రులకు గాంధర్వ రాక్షస ఆసురవివాహములు ధర్మ్యములుగ చెప్పబడినవి గాన వానికి పితౄణవిమోచకత్వము లేకపోవలసివచ్చునని శంకింపరాదు. "బ్రాహ్మణులు మూడు ఋణములుకలిగి జన్మించుచున్నా"రను శ్రుతిచే బ్రాహ్మణులకే ఋణత్రయము ప్రతిపాదింపబడినది గాన ఆఋణత్రయవిముక్తి చేయుగలపుత్రులు వారికే ఆవశ్యకముగాన తదితర క్షత్రియాదులకు పితౄణవిమోచకత్వము లేకపోవుట ఇష్టమే.

7-వ పేరా. న చ శ్రుతిస్థబ్రాహ్మణశబ్దస్య బ్రహ్మణస్సకాశాదాగతా బ్రాహ్మణాః బ్రహ్మజ్ఞానవిశిష్టా బ్రాహ్మణాః ఇత్యర్థాన్తరం కల్ప్యత ఇతి వాచ్యమ్. వర్ణాశ్రమాచారధర్మప్రవర్తకమన్వాదిధర్మశాస్త్రమూలచ్ఛేదాపత్తేః.

7-వ పేరా. శ్రుతియందలి బ్రాహ్మణశబ్దమునకు బ్రహ్మవద్దనుండి వచ్చినవారలు బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానముతో కూడినవారు బ్రాహ్మణులు అను మరియొక అర్థము కల్పింపబడగలదని శంకింపరాదు. వర్ణాశ్రమాచారధర్మములను ప్రవర్తింపచేయు మన్వాది ధర్మశాస్త్రములకు మూలచ్ఛేద మేర్పడవలసివచ్చును.

౮-వ పేరా. నచ క్షత్రియాదీనాం ఋణత్రయస్యాభావే తన్మోచకప్రసక్తేరేవాభావాత్పుత్రోత్పాదనమనావశ్యకమితి వాచ్యమ్. ఋణత్రయవిమోచనార్థం పుత్రోత్పాదనస్య అనావశ్యకత్వేపి నాపుత్రస్య లోకోఽస్తీతి సామాన్యతోఽపుత్రస్యాలోకతాశ్రవణేన తన్నిరాసాయ-పిణ్డోదకక్రియాహేతోర్నామసంకీర్తనార్థం చ పుత్రోత్పాదనస్యావశ్యకత్వాత్.

ఇత్థం చ బ్రాహ్మదైవార్షప్రాజాపత్యాశ్చత్వార ఏవ బ్రాహ్మణానామనిన్ద్యాః తదుత్పన్నప్రజా ఏవ సుగుణశాలిన్యః. తా ఏవ పితౄణవిమోచకాః. తేషామేవాసురగాన్ధర్వరాక్షసపైశాచా నిన్ద్యాః తాదృశాసురాదివిధివిగాహితోత్పన్నానాం దుర్గుణశాలిత్వం. తేషామేవాసురాదయోఽకులీనత్వసంపాదకాః. ఏవముద్ఘోషయతో మనోష్టధానుపూర్వ్యేత్యస్య మతాన్తరత్వం కేవా న వదేయుః.

సత్యేవం వినైవోత్తరగ్రన్థపర్యాలోచనాం మతాన్తరానువాదకమష్టధానుపూర్వ్యేతి వచనమాత్రావలోకనేనైవ బ్రాహ్మణానాం గాన్ధర్వవివాహే న కోఽప్యదృష్టవిరోధ ఇతి నిశ్చిన్వన్తోఽనన్తరామశాస్త్రిణః స్వబుద్ధివైశద్యప్రకటనాయ గురోరన్తికే మేఘసన్దేశీయాద్యశ్లోకపఠనసమయ ఏవ కశ్చిత్కాన్తేత్యత్ర కాచిత్కాన్తేతి వక్తవ్యే కాళిదాసో బభ్రామేతి ససంభ్రమముచ్చైశ్చరనుపదం ప్రజల్పతో మహిషశతాఖ్యస్య శిష్యస్య సోదరతామవాపుః.

సమాప్తోయం షష్ఠ్యనుః పరిహాసః.

౮-వ పేరా. క్షత్రియాదులకు ఋణత్రయము లేనిచో తద్విముక్తి ప్రసక్తియు లేదు. కాబట్టి పుత్రులే వారికి అనవసరమని శంకింపరాదు. ఋణత్రయవిమోచనమునకు పుత్రులు అనవసరమైనను పుత్రులులేనివానికి లోకము లేదను వచనమననుసరించి అట్టి లోకమును సంపాదించిపెట్టుటకు పిండోదకక్రియలు చేయుటకు పేరును చెప్పుకొనుటకు పుత్రోత్పాదన మావశ్యకమే.

ఇట్లు బ్రాహ్మ, దైవ, ఆర్ష ప్రాజాపత్యములు నాలుగే బ్రాహ్మణులకు అనిందితములు వానివలనపుట్టిన సంతానమే సుగుణవంతము. అదియే పితృఋణవిమోచనము బ్రాహ్మణులకే. ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములు నింద్యములు. అట్టి ఆసురాదివిధు

లచే వివాహితులగు స్త్రీలయందు పుట్టినవారు దుర్గుణవంతులు బ్రాహ్మణులకే. ఆసురాది వివాహములు కులభ్రంశకరములు. ఇట్లు ఘోషించుచున్న మనువుయొక్క "షడానుపూర్వ్యా" అను వచనమునకు మతాంతరత్వము నెవరుచెప్పరు.

ఇట్లుండగా ఈ తత్త్వగ్రంథమును పర్యాలోచించకయే మతాంతరమును అనువదించు 'షడానుపూర్వ్యా' అను వచనమును మాత్రముచూచి బ్రాహ్మణులకు గాంధర్వవివాహ విషయమున విరోధములేదని నిశ్చయించుకొనిన అనంతరామశాస్త్రులు తన బుద్ధివైశద్యమును ప్రకటించుటకొరకు గురువువద్ద మేఘసందేశముయొక్క మొదటిశ్లోకమును చదువునప్పుడే కాళిదాసకశ్చిత్కాన్తా అనుటెక కాచిత్కాన్తా అని చెప్పవలసియుండె భ్రమ జెందెనని మిక్కిలి సంభ్రమముతో బిగ్గరగ మాట్లాడు మాహిషకుడను శిష్యునకు సోదర్యమును వహించిరి.

ఐదవపరిహాసము సమాప్తము.



# షష్ఠః పరిహాసః

అథేదానీం కలియుగముఖ్యాశ్రయస్థాపకపరాశరస్మృతేస్స్వకల్పితమన్వర్థవిపరీతార్థప్రతిపాదనాద్యత్యాజ్యత్వముక్తమనన్తరామశాస్త్రిభిస్తద్విషయే కించిద్విచారయామః.

ఇప్పుడు కలియుగమునందు ప్రమాణముగ నాదరింపబడు పరాశరస్మృతికి మన్వర్థవిపరీతార్థ ప్రతిపాదకత్వమును కల్పించుటచే దానిని త్యజింపవలయునని అనన్తరామశాస్త్రులు చెప్పిన విషయమునుగురించి విచారింతము.

1-వ పేరా. కథమస్య మనుమతమేవానుసరతః పరాశరస్య త్యాజ్యత్వమ్.

1-వ పేరా. మను మతముచే అనుసరించు పరాశరస్మృతి యెట్లు త్యజించుటకు శక్యమగును.

2-వ పేరా. ప్రాప్తేతు ద్వాదశే వర్షే కన్యా యా న ప్రదీయతే, మాతా చైవ పితా చైవ బాన్ధవాః పితరస్తథా. సర్వే తే నరకం యాన్తి దృష్ట్వా కన్యాం రజస్వలామ్. ఇతి. ద్వాదశేభ్యో వర్షేభ్యోఽర్వాక్కన్యాయా అదానే పిత్రాదీనాం నరకప్రాప్తిరిత్యుక్తవతః పరాశరస్య కథం మనుమతానుసారితేతి వాచ్యం. కాలేఽదాతా పితా వాచ్యో వాచ్యశ్చానుపయన్పతిరితి. మనునాపి కాలేఽదాతుః పితుర్వాచ్యత్వస్య విహితత్వాత్. కాలవివరణం తు ప్రపఞ్చితమ్ తృతీయపరిహాసేఽష్టమకోట్యామ్.

2-వ పేరా. ద్వాదశవర్షము సంప్రాప్తించగా కన్యను దానముచేయనిచో తల్లియుం తండ్రియుం బంధువులును పితృదేవతలును రజస్వలయగు కన్యనుజూచి నరకము పొందుచున్నారు." పన్నెండు సంవత్సరములకులోగా కన్యను దానముచేయనిచో తండ్రి మున్నగువారికి నరకప్రాప్తిని చెప్పిన పరాశరుడు మనుమతమును అనుసరించినవాడుగ నెట్లగుచున్నాడని శంకింపరాదు. సరియైనకాలమున దానముచేయని తండ్రియుం ఋతుకాలమున పత్నీగమనముచేయని భర్తయుం నింద్యుడని మనువచనముచే కాలమునందు దానముచేయని తండ్రికి నింద్యత్వము విధింపబడియే యున్నది. కన్యాదానమును గురించిన వివరణము తృతీయపరిహాసముయొక్క యెనిమిదవకోటియందు నిరూపింపబడియున్నది.

3-వ పేరా. నచ యస్తాం వివాహయేత్కన్యాం బ్రాహ్మణో ధనమోహితః. అసమ్భాష్యో హ్యపాఙ్క్తేయః స విప్రో వృషలీపతిః. ఇతి సఞ్జాతరజస్కాపరిణేతుర్బ్రాహ్మణస్య వృషలీపతిత్వాపాఙ్క్తేయత్వప్రతిపాదకః పరాశరః కథం మన్వర్థానుసారీ భవేదితి వాచ్యమ్ తాదృశవృషలీపతిత్వాపాఙ్క్తేయత్వయోర్మనునాపి ముక్తకణ్ఠముదీరితత్వాత్. తథాచ మనుః 3 అ. అపాఙ్క్తేయప్రకరణే 155 శ్లోకః. కుశీలవోఽవకీర్ణీ చ వృషలీపతిరేవ చేతి.

3-వ పేరా. "ధనముచే అట్టి కన్యచే మోహింపబడినవాడై బ్రాహ్మణుడు వివాహమాడినచో అతడు సంభాషణకును అన్నపఙ్క్తికిని నర్హుడు. ఆ బ్రాహ్మణుడు శూద్రస్త్రీకి భర్తయగుచున్నాడు." అని రజస్వలను పరిణయమాడిన బ్రాహ్మణునకు వృషలీపతిత్వము, అపఙ్క్తేయత్వమును, ప్రతిపాదించు పరాశరుడు మన్వర్థమును అనుసరించియే వానిని జెప్పుచున్నాడని శంకింపరాదు. అట్టి వృషలీపతికి అపాఙ్క్తేయత్వము మనువుచేత ముక్తకంఠముగ జెప్పబడియున్నది. మ. 3. అ. 155, శ్లో. అపాఙ్క్తేయప్రకరణము "వాట్యవృత్తికలిగినవాడును. స్త్రీసంపర్కముచే స్ఖలితబ్రహ్మచర్యుడు కలిగినవాడును. సవర్ణను వదలి శూద్రను వివాహమాడినవాడును అపాఙ్క్తేయులు"

4-వ పేరా. నచ మన్వభిహితవృషలీపతిశబ్దేన కథం సఞ్జాతరజస్కాపరిణేతా గృహ్యత ఇతి వాచ్యమ్ అనుక్తేఽపి మనునా తల్లక్షణేఽవిరుద్ధము క్తమన్యతో గ్రాహ్యమితి న్యాయేన పరాశరోక్తస్యైవ తస్య గ్రాహ్యత్వాత్ అన్యథా మనునా అనుక్తానాం దివ్యప్రతిసర యజ్ఞోపవీతవిధాన రజస్వలానియమ పుంసవన సీమన్త స్నానభేద ఆచమన నియమ దత్తగ్రహణ విధ్యాదీనామితరస్మృతిప్రతిపాదితానామగ్రాహ్యత్వాపత్తిః.

4 వ పేరా. మనువుచెప్పిన వృషలీపతిశబ్దముచే రజస్వలను వివాహమాడినవాడు గ్రహింపబడుటకు ప్రమాణమేమని శంకింపరాదు. మనువు దానికి లక్షణము చెప్పకపోయినను "అవిరుద్ధమైన అనుక్తవిషయము ఇతరమునుండి గ్రహింపవలయును." అను న్యాయముచే పరాశరోక్తమయినదియే దానికి లక్షణముగ గ్రహింపవలసియున్నది. అట్లు కానిచో మనువుచే జెప్పబడని, దివ్యప్రతిసర, యజ్ఞోపవీతవిధాన, రజస్వలానియమ పుంసవన, సీమంత, స్నానభేద, ఆచమననియమ, దత్తగ్రహణవిధి మున్నగువానిని స్మృత్యంతరములనుండి గ్రహించుటకు శక్యముగాకపోవచ్చును.

5-వ పేరా. నచ వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిర్నహి సన్దేహాదలక్షణమితి న్యాయేన వృషలీపతిశబ్దస్య శూద్రాపతిరిత్యర్థం వివృణ్వతః కుల్లూకభట్టస్య వ్యాఖ్యాయా జాగరూకత్వాత్కథం తేన శబ్దేన సఞ్జాతరజస్కాపరిణేతా గృహ్యత ఇతి వాచ్యమ్. తాదృశవ్యాఖ్యాయా నిష్ప్రమాణత్వాత్. అనేకస్మృత్యుపబృంహితశ్రుత్యపేక్షయా వ్యాఖ్యాయా అతీవ దౌర్బల్యాచ్చ తథా చేతిహాసః— అగ్రే మాహిషకం దృష్ట్వా మధ్యే తు వృషలీపతిమ్, అన్తే వార్ధుషికం దృష్ట్వా నిరాశాః పితరో గతాః. మహిషీత్యుచ్యతే భార్యా తద్భగేనార్జితం ధనం, తద్ద్రవ్యముపజీవన్యః స వై మాహిషికస్స్మృతః. పితుర్గృహే తు యా నారీ రజః పశ్యత్యసంస్కృతా, సా నారీ వృషలీ జ్ఞేయా తత్పతిర్వృషలీపతిః. సమర్ఘం ధనముద్ధృత్య మహార్ఘం యః ప్రయచ్ఛతి, స వై వార్ధుషికో నామ సర్వకర్మబహిష్కృత ఇతి.

బృహస్పతిః— పితుర్గృహే తు యా కన్యా రజః పశ్యత్యసంస్కృతా, భ్రూణహత్యా పితుస్తస్యాస్సా నారీ వృషలీ స్మృతా. యస్తాం వివాహయేత్కన్యాం బ్రాహ్మణో మదమోహితః, అసమ్భాష్యో హ్యపాఙ్క్తేయః స విప్రో వృషలీపతిః. వృషలీ

యున్నది. మ. 9 అ. 175-176 శ్లో. "భర్తచే విడువబడినదియో, లేక విధవయో స్వేచ్ఛచే నొకనికిభార్యయై పుత్రునికనినచో వాడు పౌనర్భవు డని చెప్పబడుచున్నాడు. ఆమె అక్షతయోనియై మరియొకని వివాహమాడినను భర్తను వదలి మరియొకని నాశ్రయించి మరల భర్తకడకు తిరిగివచ్చినను పునర్వివాహసంస్కారమును పొందవలసియున్నది. "పాణిగ్రహణమంత్రములు భార్యాత్వమునందు నిమిత్తముగ నిశ్చయింపబడియున్నవి. సప్తమపద మియ్యబడగనే భార్యాత్వము నిష్పన్నమగుచున్నది." కాబట్టి ఆమంత్రములకు సప్తపదమునందే నిష్ఠ గ్రహింపదగియున్నది. కాన సప్తపదికిముందు ప్రాప్తమగు ఆపద్ధర్మమును విషయీకరించి వెనుకటివచనములు ప్రవర్తించినవనినచో అది యుక్తమే. "అయిదు ఆపదలయందు స్త్రీలకు మరియొకభర్త విధింపబడుచున్నాడ"ను పరాశరవచనమునందును అపచ్ఛబ్దము వినబడుచుండుటవలన మనువువలె పరాశరుడును అనంతరామశాస్త్రులయొక్క యనుగ్రహమునకు పాత్రులుగ నెందుకు కాలేదు?

9-వ పేరా. నచ పరాశరోక్తరీత్యా వృషల్యాస్తత్పతేశ్చైవ పాతిత్యే సిద్ధే త్రీణివర్షాణ్యుదీక్షేత కన్యా ఋతుమతీ సతీ. చతుర్థేత్వథ సంప్రాప్తే స్వయం భర్తారమావ్రజేత్, ప్రజా న హీయతే తస్యా రతిశ్చ భరతర్షభ. ఇత్యానుశాసనికపర్వాన్తర్గతేన వచనేన తత్ప్రతికారత్వాః కథమపతితాపజ్ఞప్తత ఇతి వాచ్యమ్ తత్రాపి. త్రింశద్వర్షో దశవర్షాం భార్యాం విన్దేత నగ్నికాం, ఏకవింశతివర్షో వా సప్తవర్షామవాప్నుయాదితి. ప్రథమముక్త్వానన్తరం త్రీణి వర్షాణ్యుదీక్షేతేత్యారభ్య భరతర్షభ ఇత్యన్తేన వృషల్యాస్తత్పతే స్తదుత్పన్నప్రజాయా స్తద్రతేశ్చ హైన్యాభావస్య ప్రతిపాదితత్వేనతస్యాపద్విషయత్వాత్కదాపి వ్యాసోక్త్యాఽపద్విషయికపరాశరోక్తేర్బాధాభావాత్.

9-వ పేరా. పరాశరుడు చెప్పినప్రకారము వృషలికి దానిభర్తకును పాతిత్యమేర్పడగా 'ఋతుమతియగు కన్య మూడుసంవత్సరములు వివాహమునకు నిరీక్షింపవలయును. నాల్గవసంవత్సరము ప్రాప్తించగనే తానే భర్తను సంపాదించుకొనవలయును. ఆమెయొక్క సంతతియు, రతియు హీనమైనది కాజాలదు" అను అనుశాసనికపర్వాంతర్గతమగు వచనముచే అప్రజకు రతికిని అపాతిత్యము యెట్లు సంగతమగునని శంకింపరాదు. అభారతమందును "ముప్పదిసంవత్సరములవాడు పదిసంవత్సరములు వయస్సుగలిగిన నగ్నికను భార్యగా స్వీకరింపవలయును. ఇరువదియొకటి సంవత్సరములవాడు ఏడుసంవత్సరములకన్యను పరిగ్రహింపవలయును" అని మొదటచెప్పి పిదప "మూడుసంవత్సరములు నిరీక్షింపవలయు న"ని ఆరంభించి 'భరతర్షభ' అనునంతవరకును వృషలికి దానిభర్తకు దానియం దుత్పన్నమైన సంతతికి దానియొక్క రతికిని హైన్యాభావమును ప్రతిపాదించుటచేత అది ఆపద్విషయమగ నుండుటవలన అవ్యాసోక్తిచే పరాశరోక్తికి బాధలేదు.

10-వ పేరా. కలియుగానర్హధర్మప్రవర్తకః పరాశరః కథం మనుమతానుసారీ భవతీతి వాచ్యమ్. కృతయుగాదియుగానురూపేణ ధర్మవైలక్షణ్యస్య మనునాప్యుక్తత్వాత్ తథాచ మనుః ౧. అధ్యాయే ౮౫. శ్లో. అన్యే కృతయుగే ధర్మాస్త్రేతాయాం ద్వాపరే పరే, అన్యే కలియుగే నృణాం యుగహ్రాసానురూపతఃఇతి.

10-వ పేరా. కలియుగమున కనుకూలమైన ధర్మప్రవర్తకుడగు పరాశరుడు మనుమతమును ఎందు కనుసరించెనని శంకింపరాదు. కృతాదియుగములయొక్క హ్రాసము ననుసరించి ధర్మములకు వైలక్షణ్యమును మనువుకూడ చెప్పియున్నాడు. మ. 1. అ. 85. శ్లో. కృతయుగమునందు ధర్మములు వేరుగనుండును. త్రేతాదియుగములయందును యుగములయొక్క అపచయము ననుసరించి ధర్మభేదము లుండగలవు."

11-వ పేరా. న చ దానమాత్రస్య కృచ్ఛ్రచాన్ద్రాయణాదిప్రతినిధితయా నిర్దిశన్ పరాశరః కథం మనుమతావలమ్బీతి వాచ్యమ్ కలియుగే దానస్యైకస్యైవ ముఖ్యత్వేన మనునైవ అభిహితత్వాత్ తథాచ మనుః 1. అ. 86. శ్లో. తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే, ద్వాపరే యజ్ఞమేవాహుః దానమేకం కలౌ యుగే ఇతి. అతః కృతే తు మానవా ధర్మాస్త్రేతాయాం గౌతమాః స్మృతాః, ద్వాపరే శఙ్ఖలిఖితౌ కలౌ పారాశరస్మృతిరితి, అనేన ప్రసిద్ధేన వచనేన మనుస్మృత్యపేక్షయా కలౌ పారాశరస్మృతేః ప్రాబల్యస్య సర్వసమ్మతత్వే జాగరూకే స్వాభాసయుక్తికల్పిత విపరీతమన్వర్థానుసారిణీతి పరాశరస్మృతేర్యత్త్యాజ్యత్వముక్తం తత్కో వా సహేరన్.

11-వ పేరా. దానమాత్రమును కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములకు ప్రతినిధిగ చెప్పు పరాశరుడు మనుమతావలంబకు డెట్లు కాగలడని శంకింపరాదు. కలియుగమునందు దానమున కొకదానికే ప్రాముఖ్యము. మనువుచే చెప్పబడియున్నది. మ. 1. అ. 86. శ్లో. "కృతయుగమునందు తపము, త్రేతాయుగమునందు ఆత్మజ్ఞానము, ద్వాపరయుగమునందు యజ్ఞము, కలియుగమునందు దానము ధర్మము లగుచున్నవి." ఇందువలన "కృతయుగమునందు మనూక్తధర్మములు, త్రేతాయుగమునందు గౌతమోక్తధర్మములు, ద్వాపరయుగమునందు శంఖలిఖితోక్తములు, కలియుగమునందు పరాశరోక్తములు ధర్మములగుచున్నవి" అను ప్రసిద్ధవచనములచే మనుస్మృతికంటే కలియుగమునందు పరాశరస్మృతియొక్క ప్రాబల్యము సర్వసమ్మతము గాన తనయొక్క దుష్టయుక్తులచే కల్పించబడిన విపరీతమన్వర్థములను అనుసరించదని పరాశరస్మృతి త్యాజ్యమని చెప్పుటను యెవరు సహింతురు.

12-వ పేరా. కించ స్వకృతకుయుక్తిభిర్వ్యవతీవివాహాదేర్మన్వభిమతత్వ కల్పనాదేవాత్మానం మనుం మన్యమానాః స్వాభిమతవిరోధితయా కలియుగముఖ్యానుష్ఠాపకస్య పరాశరస్యాపి త్యాజ్యత్వం కుతో న స్యాదిత్యుదీరయన్తోఽనన్తరామశాస్త్రిణః రాజభూమికాధారణమాత్రేణాత్మానం రాజానం మన్యమానో విరాటపట్టణమన్తః ప్రవిశ్య

శుద్ధాన్త కాన్తాన్తఃకరణాని వశ్యాయితుమారభ్య ఫణిహారై రర్ధచన్ద్రప్రదానైర్బహిరుత్సారితో రాజవిదూషక ఇవ సాధిక్షేపమపహాస్యతాం శరణమభూవన్.

సమాప్తోయం షష్ఠః పరిహాసః.

12-వ పేరా. ఇట్లు తనచే కల్పించబడిన శుష్కహేతువులచే యువతీవివాహాదులను మన్వభిమతముగ కల్పించుటవలన తన్ను మనువుగా భావించుచున్నటువంటివిన్ని తన అభిమతమునకు విరుద్ధముగనుండుటచే కలియుగమున ముఖ్యప్రమాణమైన పరాశరస్మృతి యెందుకు త్యజింపరాదని చెప్పు అనంతరామశాస్త్రులు రాజవేషమును ధరించిన మాత్రముచేతనే తన్ను రాజుగా తలంచుచు నిరాటంకముగ లోపల ప్రవేశించి అంతఃపురకాంతలయొక్క చిత్తములను వంచించుటకు ప్రారంభించి ఫణిహారము చేతను అర్ధచంద్రప్రదానము చేతను వెలుపలికి త్రోయబడిన రాజవిదూషకునివలె అధిక్షేపముతో పరిహాసపాత్రులైరి.

ఆరవపరిహాసము సమాప్తము.



# సప్తమః పరిహాసః

అథేదానీం వైద్యనాథదీక్షితలేఖినామనన్తరామశాస్త్రిభిరాపాదితవార్ధక్యజస్య అపస్మారమూలకస్యావివేకప్రయుక్తదోషస్యావసరప్రాప్తతయా తన్నిరాసాయ తద్విషయే కించిద్విచార్యతే.

ఇక వైద్యనాథదీక్షితరచనలకు అనంతరామశాస్త్రులచే వార్ధక్యముచే ఏర్పడిన అపస్మారమూలకమైన అవివేకప్రయుక్తత్వము ఆపాదింపబడియున్నది. అది అవసరప్రాప్తమైనది కాబట్టి దానివిషయమున కొంచెము విచారము చేయబడుచున్నది.

1-వ పేరా. నిఖిలస్మృత్యర్థపారదృశ్వనాం సకలాచారపరిజ్ఞానసాధనీభూత అఖిలవర్ణాశ్రమాచారప్రతిపాదకాద్వితీయనిబన్ధనగ్రన్థకర్తౄణాం సర్వజ్ఞానాం వైద్యనాథదీక్షితానాం లేఖనస్య కథమపస్మారమూలకావివేకప్రయుక్తదోషదుష్టత్వమాపాదనీయమ్.

1-వ పేరా. నిఖిలస్మృత్యర్థపారంగతులును సకలాచారములను తెలిసికొనుటకు సాధనమైన అఖిలవర్ణాశ్రమాచార ప్రతిపాదకములందు అద్వితీయగ్రంథకర్తలు సర్వజ్ఞులునగు వైద్యనాథదీక్షితులయొక్క రచనకు అపస్మారమూలకమైన అవివేకప్రయుక్తత్వము ఆపాదించుట యెట్లుతగును.

2-వ పేరా. సోమః ప్రథమో వివిదే గన్ధర్వో వివిద ఉత్తరః. తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః. సోమో దదద్గన్ధర్వాయ గన్ధర్వో దదదగ్నయే. రయిం చ పుత్రాంశ్చాదాదగ్నిర్మహ్యమథో ఇమామ్. ఇతి శ్రుతివిరుద్ధంయత్సోమాదిభోగేన కన్యాస్వదూష్యత్వం తథా కర్తుం రోమాద్యుత్పత్తికాలవివక్షయా షోడశ్యేత్యర్థకం వివాహస్త్వష్టవర్షాయాః కన్యాయాస్తు ప్రశస్యతే, రోమకాలే తు సంప్రాప్తే సోమో భుఙ్క్తే తు కన్యకాం, రజో దృష్ట్వా తు గన్ధర్వః కుచౌ దృష్ట్వా తు పావకః. ఇతి యమోక్తం మతోఽయం ప్రమాణయామాసతతోఽస్యోక్తదోష ఇతి వాచ్యమ్. వరణదానప్రతిపాదికాయాస్తస్యాశ్శ్రుతేరుపభోగదోషవిషయకేన యమవచనేన విరోధాభావాత్.

2-వ పేరా. మొదట సోముడు, పిదప గంధర్వుడు, దానికిపిదప అగ్ని, చివర మనుష్యుడు పొందుచున్నారు. సోముడు గంధర్వునకును, గంధర్వు డగ్నికిని ఇచ్చెను. అగ్ని నాకు ధనమును పుత్రులను ఈమెను నొసంగెను. అను శ్రుతి విరుద్ధమైనదియు సోమాదిభోగముచే కన్య యెట్లు దూష్యురాలుగాదో అట్లు చేయుటకు రోమములు ఏర్పడుటకుముందే కన్యను పరిణయమాడవలయును అను నర్థమునిచ్చు 'యెనిమిదివత్సరములు వయస్సుకలిగిన కన్యకు వివాహము ప్రశస్తము రోమకాలము ప్రాప్తించినచో

కన్యను సోముడు, రజస్సును చూచి గంధర్వుడు, కుచములను చూచి అగ్నియు ననుభవింతురు" అను యమవచనమును ప్రమాణముగ చేసినందువలననే చెప్పబడిన దోషమేర్పడినది యని శంకింపరాదు. వరణ, దానములను ప్రతిపాదించు అశ్రుతికి ఉపభోగ దోషమును విషయీకరించు యమవచనముతో విరోధములేదు.

3-వ పేరా. న చ యతోఽయం వైద్యనాథదీక్షితో రోమాద్యనుత్పత్తికాల ఏవ కన్యాయా వివాహమభిప్రేత్య కన్యాస్వరూపనిరూపణే యస్యాశ్చ రోమశే జఙ్ఘే ఇత్యాదిప్రలలాప, తత ఏవాస్యోక్తదోష ఇతి వాచ్యమ్ స్త్రీణాం వివాహస్య ఉపనయనస్థానీయత్వమతిదిశ్య కన్యాలక్షణనిరూపణే మ. 3—8. శ్లో. "నాలోమికాం నాతిలోమామితి వదతో మనోరపి తాదృశదోషాపత్తే ర్దుర్వారత్వాత్."

3-వ పేరా. వైద్యనాథ దీక్షితుడు రోమము లేర్పడని కాలమునందే కన్యకు వివాహమును అభిప్రాయపడి కన్యాస్వరూప నిరూపణమునందు "ఎవతెకు జంఘములయందు రోమములుండునో అట్టి స్త్రీని వివాహమాడరాదు" అని ప్రలాపము చేసినందువలననే దీనికి చెప్పబడినదోషము యేర్పడుచున్నది అని శంకింపరాదు. స్త్రీలకు వివాహము ఉపనయనస్థానముగ అతిదేశించి కన్యాలక్షణమును నిరూపించునప్పుడు మ. 3. అ. 8. శ్లో. "రోమము లేనిదానిని అతిలోమములు కలిగినదానిని వివాహమాడరాదని చెప్పు మనువునకు కూడా ఆ దోషము సంభవించుచున్నది."

4-వ పేరా. న చ వివాహార్థేఽపేక్ష్యాభిలషితశ్మశ్రువ్యఞ్జనాదిసత్త్వాసత్త్వపరిజ్ఞానం న కదాచిద్యౌవనాదర్వాక్సంభవతీతి కేవలస్వప్రతిభావిలసితాభాసార్థమేవాభిప్రేత్యేష్టాపత్తిరితి వాచ్యమ్ షష్ఠేఽస్థిస్నాయునఖాః కేశలోమవివిక్తతేతి గర్భస్థస్యైవ శిశోః షష్ఠ ఏవ మాసి రోమాద్యుత్పత్తేర్గర్భోపనిషదాదిసర్వగ్రన్థైః ప్రతిపాదితత్వేనానుభవసిద్ధత్వేన చ, యౌవనాదర్వాగ్బాలాయా జఙ్ఘే రోమశే న వేతి జ్ఞాతుమశక్యమితి వక్తుమశక్యత్వాత్.

4-వ పేరా. వివాహమునకు అపేక్షింపబడిన గడ్డము, మీసము, ఇతర చిహ్నములు ఉండునది లేనిది తెలియుట యెన్నటికిని యవ్వనమునకు ఇవతల యేర్పడదు కాబట్టి కేవలం తన ప్రతిభచే కల్పించబడిన భ్రాంతమగు నర్థమును అభిప్రాయపడి ఇష్టాపత్తియని చెప్పబడినది అని శంకింపరాదు. ఆరవమాసమునందే గర్భస్థ శిశువునకు అస్థిస్నాయు నఖ కేశరోమములు యేర్పడునని గర్భోపనిషత్ మున్నగు గ్రన్థముల చేతను అనుభవసిద్ధమగుటచేతను యవ్వనమునకు ఇవతలనే బాలికకు జంఘములు రోమయుక్తములు అగునా కావాయని తెల్సుకొనుటకు శక్యము కాదని చెప్పుట యుక్తము కాదు.

5-వ పేరా. న చ యతోఽయం వసిష్ఠాదినామభిర్బహూని వచనాని పూర్వోత్తరాసన్దర్భాణి లిలేఖ తతోఽస్యోక్తదోష ఇతి వాచ్యమ్. మనుయాజ్ఞవల్క్యయోరివ వసిష్ఠాదీనామపి స్మృతికర్తృత్వేన పరిగణనాత్ తథా చ యాజ్ఞవల్క్యః—మన్వత్రి విష్ణు హారీత యాజ్ఞవల్క్యోశనోఽఙ్గిరాః యమాపస్తమ్బ సంవర్తాః కాత్యాయన బృహస్పతీ పరాశరవ్యాసశఙ్ఖ లిఖితా దక్షగౌతమా

శాతాతపో వసిష్ఠశ్చ ధర్మశాస్త్రప్రవర్తకాః ఇతి వసిష్ఠాదినామభిర్వైద్యనాథ దీక్షితో దాహృత వచనానాం ప్రాచీన నవీన నిఖిల నిబన్ధనకారైర్గృహీతత్వాత్ వసిష్ఠాదివచనా నాం పూర్వోక్తరాసన్దర్భస్య సర్వదా నిషిద్ధయువతీవివాహ ప్రవర్తక ప్రజ్ఞామాత్ర కలిపితత్వాచ్చ అన్యథా సూత్రస్మృత్యుపస్మృతి నిబన్ధన వ్యాఖ్యాన కర్తౄణాం సర్వేషా ముప్యుక్త దోషదూషితత్వాఙ్గీకారాపత్తి ర్దుర్వారైవ స్యాత్.

5-వ పేరా. వసిష్ఠుడు మున్నగువారి నామములతో పూర్వోక్తసందర్భములకు విరుద్ధములగు పెక్కువచనములను ఇతడు వ్రాసియున్నందువలన చెప్పబడిన దోషము యేర్పడుచున్నది అని శంకింపరాదు. మనుయాజ్ఞవల్క్యులవలెనే వసిష్ఠాదులుగూడా స్మృతికర్తలుగనే పరిగణింపబడియున్నారు. యాజ్ఞవల్క్యుడు "మనువు అత్రి విష్ణువు హారీతుడు యాజ్ఞవల్క్యుడు ఉశనుడు అంగీరసుడు యముడు ఆపస్తంబుడు సంవర్తుడు కాత్యాయనుడు బృహస్పతి పరాశరుడు వ్యాసుడు శంఖుడు లిఖితుడు దక్షుడు గౌతముడు శాతాతపుడు వసిష్ఠుడు ధర్మశాస్త్ర ప్రవర్తకులని" చెప్పియున్నాడు. వసిష్ఠాదులయొక్క నామములచే వైద్యనాథదీక్షితు లుదహరించినవచనములను ప్రాచీనులు నవీనులు మొదలగు గ్రన్థకర్తలు అందరు గ్రహించియున్నారు. వసిష్ఠాదివచనములకు పూర్వోక్తరాసందర్భ కల్పన అన్నినిధముల యువతీవివాహమును ప్రవర్తింపజేయువారియొక్క ప్రజ్ఞామాత్రముచే నేర్పడినది లేనిచో సూత్ర స్మృతి ఉపస్మృతి గ్రన్థతద్వ్యాఖ్యానకర్తల కందరికిని చెప్పబడిన దోషముచే దూషితత్వము నంగీకరింపవలసివచ్చును.

6-వ పేరా. న చేష్టాపత్తిరితి వాచ్యమ్. ఈశ్వరాంశసమ్భూతానాం మహర్షీణాం నిఖిలశాస్త్రార్థతత్త్వవేదినాం మహాత్మనాం నిబన్ధనాదికర్తౄణాం చ తాదృశదోషారోపణాపేక్షయా శక్తిపూరణానన్యగతికతయా కిం ప్రభూనాశ్రిత్య తత్పరితోషణాయైతాదృశగర్వజనకనిన్ద్యా యశోఽకీర్తిసమ్పాదకయువతీవివాహసాధక యువతీవివాహసాధక గ్రన్థరచనోపక్రమమాణస్య విజ్ఞాతశాస్త్రమర్యాదస్యాజ్ఞాతధర్మశాస్త్రవాదనస్య స్వస్యైవ తాదృశదోషాఙ్గీకారస్యాతీవోచితత్వాత్. సత్యేవం కతిపయగీర్వాణపదపరిజ్ఞానసఞ్జనితదుర్భగగర్వాతిరేకేణ బినైవ ధర్మశాస్త్రవచనానాం సకలస్మృత్యాచారవిరుద్ధో యువతీవివాహోఽయుక్త ఇతి, కంచిద్దుర్వాదమారభ్య, తత్సాధనాయ మనువచనానామపార్థం పరికల్ప్య, తద్దార్ఢ్యాయ కలియుగమాఖ్యాతస్థాపకపరాశరస్య త్యాజ్యత్వముక్త్వా, తత్సిద్ధయే సర్వేషామేవ మహాత్మనాం ధర్మశాస్త్రానభిజ్ఞత్వమూఢత్వే ప్రజల్ప్య, తత్స్థైర్యాయ వైద్యనాథదీక్షితానాం వార్ధక్యజన్యాపస్మారమూలకాఽవివేకత్వమాపాద్య తస్మైచిదనర్థస్థిరీకరణాయ యథోక్తరమణీకృష్టార్థపనప్పురాయైవాత్మబుద్ధిం వినియోజ్య నిర్లజ్జం. గ్రన్థరచనాయోపక్రమమాణా అన్తగామశాస్త్రిణః. శ్లో. భిక్షో మాంసనిషేవణం కిముచితం కిం తేన మద్యంవినా, మద్యం చాపి తవ ప్రియం ప్రియమహో వారాంగనాభిస్సహ. వారస్త్రీరతయే కుతస్తవ ధనం ద్యూతేన చౌర్యేణ వా, చౌర్య

ద్యూత పరిశ్రమోఽస్తి భవతాం భ్రష్టస్య కాన్యా గతిః. ఇత్యేతచ్ఛ్లోకప్రతిపాదిత భ్రష్టభిక్షుకసబ్రహ్మచారితామగమన్.

సమాప్తోఽయం సప్తమః పరిహాసః.

6-వ పేరా. అది ఇష్టమే అని చెప్పరాదు. ఈశ్వరాంశసంభూతులగు మహర్షులను సకలశాస్త్రార్థతత్వములు తెలుసుకొనిన మహాత్ములగు గ్రంథకర్తలను అట్టిదోషము నాచరించుటకంటె ఉదరపూరణమునకు గత్యంతరములేక కుత్సితులగు ప్రభువుల నాశ్రయించి వారిని సంతోషపెట్టుటకు సర్వజననింద్యమును అపకీర్తి సంపాదకము నగు యువతీవివాహసాధనమైన గ్రంథరచనకు గడంగిన శాస్త్రమర్యాద తెలియని ధర్మశాస్త్ర గ్రంథ మాఘ్రాణించని తనకే అట్టిదోషము నారోపించుకొనుట యుక్తము. ఇట్లుండగా నేదియో కొన్ని సంస్కృతపదములను తెలుసుకొనుటచే నేర్పడిన గర్వాతిశయము వలన ధర్మశాస్త్రగ్రంథములేక సకల స్మృత్యాచారములకు విరుద్ధమగు యువతీవివాహము యుక్తమని దుష్టవాదము నొకదానిని ప్రారంభించి దానిని సాధించుటకై మనువచనములకు అపార్థములనుకల్పించి దానిని దృఢీకరించుటకు కలియుగప్రధానమగు పరాశరస్మృతికి త్యాజ్యత్వమును చెప్పి అది సిద్ధించుటకై మహాత్ములకందరికిని ధర్మశాస్త్ర జ్ఞానములేదని వారు మూఢులని ప్రలాపము చేసి దానిని స్థిరపరచుటకు వైద్యశాధకిత్సలకు కుదిరిచే నేర్పడిన అపస్మారమూలక అవివేకమును ఆపాదించి అనిష్టమగు విషయము స్థిరపరచుటకు దానికంటెను బలిష్ఠములగు అనిష్టపరంపరలకు తనబుద్ధిని వినియోగించ లజ్జలేక గ్రంథరచనకు ఉపక్రమించిన అనంతరామశాస్త్రులు "భిక్షుకుడా మాంస నిషేవణము నీకుకలదా. మద్యములేనిదానితో నేమిప్రయోజనము. మద్యముకూడా నీకు ప్రియమైనదా. వేశ్యాస్త్రీలతో కూడిన మద్యము ప్రియమైనదే. వేశ్యాస్త్రీ రతికి నీకు ధనమెక్కడిది. దొంగతనముచేతను జూదముచేతను లభించును. చౌర్యద్యూతములందు మీకు పరిశ్రమముకలదా, భ్రష్టునికి గత్యంతర మేమున్నది" అనుశ్లోకమున ప్రతిపాదింపబడిన భ్రష్టభిక్షుకునితో సామ్యముపొందిరి.

సప్తమపరిహాసము

# అష్టమపరిహాసః

ప్రథమపరిహాసేన తత్కృతగ్రన్థాభిధానం విఖణ్డ్య ద్వితీయేన తత్కవననైపుణ్యమపాకృత్య తృతీయతురీయపఞ్చమైః యువతీవివాహస్య వివాహసామాన్యే కన్యానుమతిపూర్వకత్వస్య బ్రాహ్మణానాం గాన్ధర్వాచరణే ప్రత్యవాయాభావస్య చ తత్కల్పితమన్వభిమతత్వం సలీలం నిరస్య షష్ఠసప్తమాభ్యాం పరాశరవైద్యనాథదీక్షితయోః త్యాజ్యత్వం సార్ధచన్ద్రదానముత్సార్య, సంప్రతి స్వప్రేరకశాస్త్రిప్రతారణైకతానతయా శుష్కయుక్తిభిర్గ్రథితానాం స్వకపోలకల్పితానాం ప్రకృతానుపయుక్తానాం తత్తత్ప్రమాణవిరుద్ధానాం నీరసవిషయాణాం ఖణ్డనస్యావసరప్రాప్తతయా సఖేదమనూద్యాలమితో విచారయామః.

ప్రథమపరిహాసముచే అతనిచే రచింపబడిన గ్రంథముయొక్క నామధేయమును ఖండించి ద్వితీయముచే అతని కవననైపుణ్యమును తిరస్కరించి తృతీయచతుర్థపంచమములచే యువతీవివాహమును వివాహసామాన్యమునకు కన్యయొక్క అంగీకారములో దానమును, బ్రాహ్మణులకు గాంధర్వవివాహవిషయమున పాపాభావమును దానికి మనుసమ్మతి కల్పనను అప్రయాసముగ ఖండించి, షష్ఠసప్తమములచే పరాశర వైద్యనాథదీక్షితులకు త్యాజ్యతను అర్ధచంద్రదానముతో తొలగించి, ప్రకృతము తన్ను ప్రేరేపించిన శాస్త్రి యొక్క వంచనమునే ముఖ్యముగ నెంచుకొని శుష్కయుక్తులచే నిర్మింపబడినవియు, స్వకపోలకల్పితములును, ప్రకృతమున కుపయుక్తములుగానివియు, ప్రమాణవిరుద్ధములు నగు నీరసములయిన విషయములను, ఖండించుట యవసరప్రాప్తమయినది. కాన సప్రయాసముగ గ్రంథమునంతయు విచారింతము.

1-వ పేరా. యత్తూక్తం యువతీవివాహసిసాధయిషుభిరనన్తరామశాస్త్రిభిర్వివాహో నామాన్యోన్యస్యావ్యభిచారనిశ్చయద్యోతకో మన్త్రాగ్నిసంబన్ధాదినిష్పాద్యః కర్మవిశేష ఇతి తన్న క్వాపి వివాహవిధిషు లక్షణస్యాస్య దృష్టత్వాత్ త్యాజ్యత్వాధివేత్తవ్యత్వాదేర్విధీయమానత్వాత్—తథాచ మనుః. 9 అధ్యాయే. 80-81-83 శ్లోకాః. మద్యపా సాధువృత్తా చ ప్రతికూలా చ యా భవేత్. వ్యాధితా వాధివేత్తవ్యా హింస్రార్థఘ్నీ చ సర్వదా. వన్ధ్యాష్టమేఽధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా. ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ. అధివిన్నా తు యా నారీ నిర్గచ్ఛేద్రుషితా గృహాత్. సా సద్యస్సన్నిరోద్ధవ్యా త్యాజ్యా వా కులసన్నిధావితి. వరణవాగ్దానప్రదానపాణిపీడనసప్తపద్యాఖ్యపఞ్చాఙ్గవిశిష్టత్వస్య స్మృతికర్తృభిరుక్తస్య వివాహలక్షణస్యాతివిరుద్ధత్వాత్ తథాచ మరీచిః వాగ్దానం చ ప్రదానం చ వరణం పాణిపీడనమ్. సప్తపదీతి పఞ్చాఙ్గో వివాహః పరికీర్తిత ఇతి.

బడినదియున్నైనది" భాష యని చెప్పబడును. భాషయన ప్రతిజ్ఞ—భాష, ప్రతిజ్ఞ, పక్షము అనునవి ఏకార్థకము.

3-వ పేరా. యత్తుమన్త్రాగ్నిసంబన్ధాదేర్దివ్యవిశేషత్వముక్తం తదప్యసత్. మహాభియోగేషు సన్దేహనివర్తకత్వేన కరణీయానాం దివ్యానామభియోగవివాహవిషయేఽప్రసక్తత్వాత్. తథాచ యాజ్ఞవల్క్యః-దివ్యప్రకరణే—తులాగ్న్యాపోవిషం కోశో దివ్యానీహ విశుద్ధయే, మహాభియోగేష్వేతాని శీర్షకస్థేభియోక్తరితి

3-వ పేరా. మంత్రసంబంధమును, అగ్నిసంబంధమును మున్నగువానిని దివ్యవిశేషము (ప్రమాణము) అనుటయు యుక్తము కాదు. గొప్ప నేరములయందు, సందేహము తొలగించుకొనుటకు చేయదగిన దివ్యప్రమాణములను, నేరములకు విషయములుగాని వివాహములయందు ప్రసక్తిలేదు. యాజ్ఞవల్క్యుడు దివ్యప్రకరణమునందు— "తుల, అగ్ని, ఉదకములు, విషము, కోశము అనునవి పరిశుద్ధిని తెల్పుటకు దివ్యప్రమాణములు. ఇవి గొప్ప నేరములయందే నియోగింపబడును" ఇవి నేరము నారోపించినవాడు దివ్యాదులచే తనకేర్పడు పరాజయమునకు నిమిత్తమైన దండమును ఇయ్యగలను అని ప్రతిజ్ఞ చేసినప్పుడు నేరమును చేసినవానియందు వీనిని ప్రయోగింపవలయును. అనగా నేర మారోపించినవాడు తాను ఎవనిపై నేరము నారోపించుచున్నాడో వాడు తులాది దివ్యప్రమాణములను చేయుచుండగ ఆ దివ్యప్రమాణములయందు ప్రతివాది జయించి తాను పరాజయమును పొందుచో వానికి తగినదండమును తాను పొందగలనని ప్రతిజ్ఞ చేసినప్పుడే దివ్యప్రమాణములను చేయింపవలయును.

4-వ పేరా. యత్తు మన్త్రాగ్నిసంబన్ధాదిర్దివ్యవిశేషత్వేన శపథదార్ఢ్యం కరోతీత్యుక్తం తదప్యయుక్తం శపథపదస్యైవ లక్షణేఽనుక్తత్వాత్.

4-వ పేరా. మంత్రాగ్నిసంబంధాదికము దివ్యవిశేషముగా శపథమును దృఢపరచుచున్నదని చెప్పుట యుక్తము కాదు. లక్షణమునందు శపథపదమునకు ప్రయోగమే లేదు.

5-వ పేరా. న చ పూర్వోక్తప్రతిజ్ఞాపర్యాయమేవ శపథపదమితి వాచ్యమ్. తస్యాపి దివ్యవిశేషత్వాత్. తథాహి అల్పాభియోగేషు సన్దిగ్ధార్థసన్దేహనివర్తకాశ్శపథాః తథాచ మనుః దేవబ్రాహ్మణపాదాంశ్చ పుత్రదారశిరాంసి చ. ఏతేచ శపథాః ప్రోక్తాస్స్వల్పేఽర్థేసుకరాస్తథేతి.

5-వ పేరా. ముందు చెప్పబడిన ప్రతిజ్ఞకు పర్యాయపదమే శపథమని శంకింపరాదు. అదియును దివ్యవిశేషరూపము. ఎట్లన—అల్పములైన అభియోగములయందు సందేహనివర్తకములు శపథములు. మనువు "దేవబ్రాహ్మణపాదములను పుత్రకళత్రముల శిరములు శపథములని చెప్పబడుచున్నవి" అర్థము స్వల్పమైనప్పుడు ఇవి సుకరములు.

6-వ పేరా. నచాస్తు సామాన్యస్వల్పాభియోగసందేహనివర్తకత్వమ్. శపథమేతేషాం దివ్యవిశేషత్వమితి వాచ్యమ్. విజ్ఞానేశ్వరేణైతేషాం దివ్యప్రకరణే పఠితత్వాత్. ఏతేషామభియోగసన్దిగ్ధార్థసన్దేహనివర్తకత్వరూపదివ్యసామాన్యలక్షణలక్షితత్వాచ్చ.

6-వ పేరా. అల్పములయిన అభియోగములయందు ఇది సందేహనివర్తక మైనచో కానిండు. కాని దీనికి దివ్యవిశేషత్వము యెట్లు సరిపడు నని శంకింపరాదు. విజ్ఞానేశ్వరుడు దివ్యప్రకరణమున దీనిని పఠించియున్నాడు. "అభియోగమునందు సందిగ్ధమైన అర్థములలో సందేహమును నివర్తింపచేయుట" యను దివ్యసామాన్య లక్షణము వీని కున్నది.

7-వ పేరా. నచైతాదృశశాస్త్రీయప్రతిజ్ఞాత్వదివ్యత్వాదికమభిప్రేత్య శాస్త్రాభి రుక్తమితి వాచ్యమ్. అస్యశాస్త్రీయత్వాభావే వధూవరయోః పరస్పరవ్యభిచారే వివాహ ప్రతిజ్ఞాయామ్మృషాప్రతిజ్ఞాత్వమితి భార్యాత్యాగినః పత్యుః పతిత్యాగిన్యాభార్యాయా దోషోపదేశశాస్త్రేషు క్రియత ఇతి దోషోద్ఘాటనస్య ప్రసక్తేరేవాభావాత్.

7-వ పేరా. ఇటువంటి శాస్త్రీయములయిన ప్రతిజ్ఞాత్వమును దివ్యత్వాదిక మును అభిప్రాయమునం దుంచుకొని మేము చెప్పలేదు అని శంకింపరాదు. ఇది శాస్త్రీయము కానిచో వధూవరులకు పరస్పరవ్యభిచార మేర్పడినపుడు వివాహప్రతిజ్ఞ అసత్యప్రతిజ్ఞ యగును. కాన భార్యను పరిత్యజించిన భర్తకు భర్తను పరిత్యజించిన భార్యకు శాస్త్రములయందు దోషములను చెప్పుటకు ప్రసక్తియే యుండదు.

8-వ పేరా. యత్తు అజ్ఞానేనాన్యబలాత్కారేణ వా కృతస్యాకృతత్వమేవేతి మనునోక్తమిత్యుక్తమ్ తదప్యపార్థగర్భితమ్. గురుపురోహితబన్ధుజనైస్సహ శిష్టాచారాది కార్యకర్త్రా కన్యాదాత్రా కృతస్యాస్య వివాహస్యాజ్ఞానాన్యబలాత్కారకృతత్వస్య వా తత్ప్రయుక్తాకృతత్వస్య వా వక్తుమశక్యత్వాత్.

8-వ పేరా. "అజ్ఞానము చేతను ఇతర బలాత్కారము చేతనుగాని చేయబడినది చేయబడనిదే" యని మనువుచే చెప్పబడినదనుట అపార్థముచే నిండితము. గురు, పురోహిత, బంధుజనములతో గూడ శిష్టాచారాదికార్యములను చేసిన కన్యాదాతచే చేయ బడిన వివాహమునకు అజ్ఞానకృతత్వమును ఇతర బలాత్కారకృతత్వమునుగాని అందు చేత సిద్ధించిన అకృతత్వమును చెప్పుటగాని శక్యముగాదు.

9-వ పేరా. నచాజ్ఞానాన్యబలాత్కారయోః కన్యాయామవిద్యమానత్వాద్వివా హస్యాకృతత్వమస్త్వితి వాచ్యమ్. మనూక్తేర్దాతృమాత్రవిషయత్వాత్. తథాచ మనుః 8 అధ్యాయే 163-168 శ్లో. మత్తోన్మత్తార్తాద్యధీనైర్బాలేన స్థవిరేణ వా, అసం బద్ధకృతశ్చైవ వ్యవహారో న సిద్ధ్యతి. బలాద్దత్తం బలాద్భుక్తం బలాద్యచ్చాపి లేఖితమ్, సర్వాన్ బలకృతానర్థానకృతాన్ మనురబ్రవీదితి.

9-వ పేరా. కన్యకు అజ్ఞానము (పరుల బలాత్కారము) నున్నదిగాన వివా హము చేయబడనిదియే యని యాశంకింపరాదు. మనువుయొక్క వచనము దాతను మాత్రమే విషయీకరించుచున్నది. మ. 8 అ. 163-168 శ్లో. (మద్యపానముచే) "మత్తునిచేతను, ఉన్మత్తునిచేతను, వ్యాధిపీడితునిచేతను, బాలునిచేతను, వృద్ధునిచేతను చేయబడినదియు, సంబంధములేనివానిచే చేయబడినదియు, అనగా (తండ్రి సోదరుడు

మున్నగువారిచే నియోగింపబడక) చేయబడినదియు నైన ఋణగ్రహణాదివ్యాపారము చెల్లదు. బలముచే ఈయబడినదియు, తినబడినదియు, వ్రాయించబడినదియు, బలాత్కృతములని" మనువుచే చెప్పబడినది గాన ఇది యేవియుం జెల్లవు.

10-వ పేరా. నచ తత్ర జ్ఞానాస్య బలాత్కారకృతస్యాకృతత్వం దేయస్యాప్యస్త్వితి వాచ్యమ్. చిరపరిచితగోష్ఠాదివియోగాసహిష్ణూనాం గవాదీనాం దానాద్యసిద్ధేర్దుర్వారత్వాత్. స్త్రీణామజ్ఞానదశాయామేవ వివాహః కార్య ఇతి మన్వాదిస్మృతికర్తృభిః విధీయమానత్వాచ్చ తత్ప్రపఞ్చస్తు తృతీయపరిహారే ద్రష్టవ్యః.

10-వ పేరా. దాతయొక్క అజ్ఞానము చేతను, బలాత్కారము చేతను చేయబడినది. చేయబడనిదే యగుచో నది దానము చేయదగిన వస్తువు విషయమునందును వర్తించునని శంకింపరాదు. చిరకాలము నుండి పరిచయము కలిగిన కొట్టములను విడిచి పోవుటకు ఇష్టపడని గోవులను దానము చేయుట విషయమునను ఈ విషయము వర్తించి వానికి దేయత్వమే లేకుండ జేయును. స్త్రీలకు అజ్ఞానదశయందే వివాహము చేయదగినదని మన్వాదిస్మృతికర్తలచేత చెప్పబడియున్నది. దాని వివరణము తృతీయపరిహారమున చూడదగినది,

11-వ పేరా. యత్త్వజ్ఞానదశాయాం కన్యాయా బలాత్కృతవివాహోఽనర్థకోఽభవేదిత్యుక్తమ్. తదప్యవిచారణీయమ్. వీతత్క్షణపర్యన్తం సర్వైర్వరశ్రేష్ఠైః క్రియమాణకన్యావివాహేష్వనర్థస్యాదృష్టత్వాత్.

11-వ పేరా. అజ్ఞానదశయందు కన్యకు బలాత్కారముగ వివాహము చేయుట అనర్థకమనుటయుం దగదు. ఈక్షణమువరకు అందరిచే చేయబడిన కన్యావివాహముల యందు అనర్థకములు పుట్టినట్లు కనబడలేదు.

12-వ పేరా. నచానర్థక్యం తత్ర తత్ర దృశ్యత ఇతి వాచ్యమ్. తస్య నీచజాతిషు క్రియమాణస్వేచ్ఛానుకన్యావతీవివాహేష్వపీతోఽప్యధికతయా దృశ్యమానత్వాత్ తాదృశానర్థక్యస్య ప్రాక్తనసంస్కారైకకారణత్వేన మన్తవ్యత్వాచ్చ.

12-వ పేరా. అచ్చటచ్చట ననర్థములు కన్పట్టుచున్నవి యనుటయుం దగదు. అది నీచజాతులయందు చేయబడు స్వేచ్ఛాయువతీవివాహములయందు నైతె నింతకంటె నెక్కువగనే కన్పట్టుచున్నవి. అట్టి అనర్థములు జన్మాంతరసంస్కారములచే నేర్పడు నవియని తలంపబడియున్నవి.

13-వ పేరా. యత్తు వివాహకార్యాణాం సహధర్మచర్యాదీనామభావే శాస్త్రేణ దూషయితుమశక్యత్వాదిత్యుక్తమ్. తదప్యసత్. దోషోపదేశస్య స్త్రీపుంధర్మాతిక్రమమూలకత్వేనేతి మనునైవోపదిష్టత్వాత్. తథా చ మనుః 8 అధ్యాయే 299 శ్లో. భార్యా పుత్రశ్చ దాసశ్చ శిష్యో భ్రాతా సహోదరః. ప్రాప్తాపరాధాస్తాడ్యాస్స్యూ రజ్వా వేణుదళేన వా ఇతి. అపరాధః ఉక్తధర్మాతిక్రమ ఇతి చణ్డేశ్వరః. న చాపి ధర్మశాస్త్రే వివాహకార్యసహధర్మచర్యాద్యభావప్రయుక్తదోషోపదేశస్య వివాహప్రతిజ్ఞాభఙ్గమూలకత్వే కిత్యప్రతిపాదితత్వాచ్చ.

13-వ పేరా. వివాహకార్యములగు సహధర్మచర్యకము మున్నగునవి లేనప్పుడు శాస్త్రముచే దూషింప శక్యము గాదనుటయుం సరియె. స్త్రీపురుషధర్మములను అతిక్రమించుటయే దోషము చెప్పుటకు మూలమని మనుస్మృతి చెప్పుచున్నది. మ 8 అ. 299 శ్లో "భార్యయుం పుత్రుడును సేవకుడు, శిష్యుడు, సోదరుడు. అపరాధము చేసినచో త్రాటి చేతనుగాని, వెదురుపేడు చేతనుగాని దండింపదగినవారు అని" అపరాధమనగా శాస్త్రోక్త ధర్మముల నతిక్రమించుటయే యని చణ్డేశ్వరుడు ధర్మశాస్త్రమం దెచ్చుట వివాహకార్యములగు సహధర్మచర్యము మున్నగునవి శాస్త్రములచే చెప్పబడినదోషము. వివాహప్రతిజ్ఞా భంగమునకు మూలమని చెప్పబడలేదు.

14-వ పేరా. యత్తు వ్యుత్పన్నచిత్తానామేవ స్త్రీణాం పుంసాం తదిచ్ఛానుగుణ్యేనైవ వివాహః కార్య ఇతి మనోర్మతమిత్యభిజ్ఞాయుక ఇత్యుక్తమ్. తదప్యనార్యజుష్టమ్. తృతీయ తురీయ పరిహాసాభ్యామేవ ప్రత్యుత్తరత్వాత్.

14-వ పేరా. వివేకవంతులగు స్త్రీలకును పురుషులకును వారియిచ్ఛననుసరించియే వివాహము గావింపవలయునని మనువుయొక్క అభిప్రాయమనుట తగదు. అది అనార్యులచే సేవింపబడినది. మూడు నాలుగు పరిహాసములచే దానికిని ప్రత్యుత్తరమియ్యబడినది.

15-వ పేరా. యత్తు మను. 9 అ. 88 శ్లో. ఉత్కృష్టాయాభిరూపాయ వరాయ సదృశాయ చ. అప్రాప్తామపి తాం తస్మై కన్యాం దద్యాద్యథావిధి ఇత్యస్య మనువచనస్య వరవిశేషణమహిమ్నా యత్ర న కదాపి కన్యాయా అనుచిర్భవేదితి నిశ్చయః తస్మై అప్రాప్తా అప్రాప్తకాలాపి దాతవ్యేత్యర్థ ఇత్యభిప్రాయవర్ణనం కృతం తత్కేవలమనాఘ్రాతమనుస్మృతినవమాధ్యాయమూలకమ్. స్త్రియస్సహజచాఞ్చల్యాదిదుర్గుణభూయిష్ఠాః రక్షణమాత్రాధీనసాధుశీలా ఇతి చ మనునైవోక్తత్వాత్. తథాచ మనుః 9 అ. 14 శ్లో. నైతా రూపం పరీక్షన్తే నాసాం వయసి సంస్థితిః. సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుఞ్జతే మ. 9 అ. 15 శ్లో. పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహాచ్చ స్వభావతః. రక్షితా యత్నతోపీహ భర్తృష్వేతా వికుర్వతే. మ. 9 అ. 17 శ్లో. శయ్యాసనమలంకారం కామం క్రోధమనార్జవమ్. క్రోధభావం కుచర్యాం చ స్త్రీభ్యో మనురకల్పయత్. మ. 9 అ. 19 శ్లో. తథాచ శ్రుతయో బహ్వ్యో నిగీతా నిగమేష్వపి, స్వాలక్షణ్యపరీక్షార్థం తాసాం శృణుత నిష్కృతీః. మ. 9 అ. 20 శ్లో. యన్మే మాతా ప్రలులుభే విచరన్త్యపతివ్రతా. తన్మే రేతః పితా వృఙ్క్తామిత్యస్యైతన్నిదర్శనమితి. మ. 9 అ. 2 శ్లోకః. అస్వతన్త్రాః స్త్రియః కార్యాః పురుషైస్స్వైర్దివానిశమ్. విషయేషు చ సజ్జన్త్యస్సంస్థాప్యా ఆత్మనో వశే. మ. 9 అ. 5 శ్లోకః. సూక్ష్మేభ్యోఽపి ప్రసఙ్గేభ్యః స్త్రియో రక్ష్యా విశేషతః. ద్వయోర్హి కులయోశ్శోకమావహేయురరక్షితాః. మ. 9 అ. 6 శ్లో. ఇమం హి సర్వవర్ణానాం పశ్యన్తో ధర్మముత్తమం. యతన్తే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి. మ. 9 అ 7 శ్లో. స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మానమేవ చ. స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం

రక్షన్ హి రక్షతి. ఇత్యాది తద్రైవ భారతసారే దృశ్యతే పతయస్స్త్రీవస్థోఽపి మమ రోచతే ఇత్యాది.

15-వ పేరా. మ. 9 అ. 88 శ్లో. "శ్రేష్ఠుడును, సుందరుడును, సజాతీయుడు నైన వరునకు యౌవనము రాకపోయినను శాస్త్రప్రకారము కన్యనీయవచ్చును" అను వచనములో వరునకీయబడిన విశేషణములన్నిటిచే కన్యకు యోగ్యుడైనవాడు యోగ్యుడైనను ఇష్టములేనిచో నీయరాదు. అను అభిప్రాయమును గ్రహించి ఆపేక్షింపబడిన వానికే కన్య నొసంగవలయునని యర్థమును వర్ణించుట యుక్తముగాదు. అది మనుస్మృతి యొక్క తొమ్మిదవ అధ్యాయమును చూచినచో గానవచ్చును. స్త్రీలు సహజముగ చాంచల్యాదిదుర్గుణములతో కూడియుందురు. వారికి మంచి నడవడిక రక్షణముచేతనే సాధ్యము అనియు మనువుచేతనే చెప్పబడియున్నది. మ. 9 అ. 14 శ్లో. "స్త్రీలు రూపమును చూడరు వయస్సునందు ఆస్థ వీరికి లేదు. సుందరరూపము కలిగిన వానినిగాని. వికృతరూపము కలిగినవానినిగాని పురుషుడగుటచే అనుభవింతురు. మ. 9 అ. 15 శ్లో. "స్వభావసిద్ధమగు వ్యభిచారశీలతవల్లను చంచలచిత్తమువల్లను స్నేహముయొక్క లేమి వల్లను భర్తలవలన ప్రయత్నముతో రక్షింపబడినప్పటికిన్ని వీరు వారి విషయమున వికృతముగ వర్తించుచునేయుందురు. మ. 9 అ. 17 శ్లో. "శయ్య, ఆసనము, అలంకారము, కామము, క్రోధము, వక్రత్వము, ద్వేషము, కుత్సితమగుచర్య, స్త్రీలకు మనువుచే కల్పింపబడినది. మ. 9 అ. 19 శ్లో. "ఇట్టియు స్త్రీలయొక్క వ్యభిచారశీలత్వమును తెల్పు వేదములయందు శ్రుతివాక్యములు పఠింపబడియున్నవి. వారి వ్యభిచారమునకు ప్రాయశ్చిత్తముగనుండు శ్రుతియును వినుడు. మ. 9 అ. 20 శ్లో. "యందువలన నాతల్లి అపతివ్రతయై పరులగృహములకు పోవుచు పరపురుషుని కోరినదో, అపరపురుష సంకల్పముచే దోషమునుపొందిన నాతల్లి రజోరూపమగు రేతస్సును నాతండ్రి శుద్ధి చేయుంగాక" యనునది దీని దృష్టాంతము. మ. 9 అ. 2 శ్లో. "తమ పురుషులచే రాత్రిం బగల్లు స్త్రీలు అస్వతంత్రులుగా చేయబడవలయును. విషయాసక్తులగు వీరు తమవశమునందే ఉంచుకొనదగినవారు. మ. 9 అ. 5 శ్లో. సూక్ష్మములయినటువంటి దుస్సంగముల నుండియు స్త్రీలు రక్షింపదగినవారు. వారు రక్షింపబడనిచో రెండు కులములకును దుఃఖమును తెత్తురు. మ. 9 అ. 6 శ్లో. "ఈ స్త్రీరక్షణమును సమస్తవర్ణములకు ఉత్తమధర్మముగా చూచుచూ దుర్బలులైన భర్తలుకూడా తమభార్యలను రక్షించుకొనవలయును. మ. 9 అ. 7 శ్లో. "భార్యను రక్షించుకొనువాడే తన సంతతిని శిష్టాచారమును, కులమును, తన్ను తనధర్మమును రక్షించుకొనుచున్నాడు. ఇవి మున్నగునవి కలవు. అట్లే భారతసారమునందు అయిదుగురుభర్తలు కాదగలరు. ఆరవభర్త కావు ఇష్టుడే ఇదియును మున్నగునవి కలవు.

16-వ పేరా. యత్తు వివేకబలాదప్రాప్తకాలాయా వివాహో జేష్ట ఇతి గమ్యతే కాలప్రాప్తిం చ కన్యాలక్షణపరీక్షా కార్యా ప్రథమం వివాహాదితి వదన్ మనుర్యౌవనప్రాప్తిమేవ అభిప్రైతీత్యత్ర న కోఽపి విశయావకాశ ఇత్యుక్తమ్. తదసా

ఘా)కమనస్మృతి ద్వితీయాధ్యాయమూలకమ్. మానవే ద్వితీయాధ్యాయే ఉపనయన ప్రకరణ ఏవ స్త్రీణాం వివాహస్య ఉపనయనత్వా-లయోరతి దిష్టత్వాత్ తత్ప్రకణ్వస్తు తృతీయపరిచ్ఛేదే ద్రష్టవ్యః.

16-వ పేరా. అప్రాప్తామపి కాలం దద్యాత్—అను నెడ అపి శబ్దబలము వలన అప్రాప్తకాలయగు కన్యక వివాహము ఇష్టము కాదు అని తెలియుచున్నది. వివాహము నకు ముందు కన్యయొక్క లక్షణములు [illegible] పరీక్షించవలయునని చెప్పి మనువు యోగ్యవయ ప్రాప్తి వివాహకాలము అభిప్రాయపడుచున్నాడు అని [illegible] మనుస్మృతియొక్క ద్వితీయాధ్యాయము [illegible] చెప్పబడుచున్నది. మ 2 అధ్యాయము [illegible] ఉపనయన [illegible] స్త్రీల వివాహమును ఉపనయనమును [illegible] ఉపదేశించుచున్నవి. [illegible] పరిచ్ఛేదమును చూడవలసినది.

17-వ పేరా. యత్తు అవ్యఙ్గాఙ్గీం సౌమ్యనామ్నీం [illegible] తనులోమకేశదశనాం మృద్వఙ్గీ ముద్వహేత్ స్త్రియమితి. అత్ర [illegible] లక్షణలక్షితాయాః స్త్రియాః వివాహః కార్య [illegible] బాలావోఢవ్యేతి గమ్యతే త్యుక్తమ్ తదసఙ్గతమేవ గమ్య [illegible] కత్వాత్

17-వ పేరా. [illegible] సౌమ్యమైన పేరు కలిగినదియు, హంసవలెను యేనుగువలెను నడచునదియు [illegible] దంతములును కలిగినదియు [illegible] కలిగినదియు నగు స్త్రీని వివాహమాడవలయును” అను లక్షణములతో కూడిన కన్యను వివాహమాడవలయునని చెప్పియున్నందున యెన్నటికిని బాలిక, వివాహమాడదగినది కాదు; అని శంకించుట సరియైనది కాదు. ఈ వ్యంగ్యమైన అర్థమునకు మూలము లేదు.

18-వ పేరా. న చావ్యఙ్గాఙ్గీమిత్యత్ర అవికలాఙ్గీమిత్యర్థే సిద్ధే కథం గమ్యమానార్థస్య మూలకత్వమితి వాచ్యం జ్ఞాప్యజ్ఞాపకయోస్సంబన్ధాభావాత్.

18-వ పేరా. అవ్యఙ్గాఙ్గీమ్—(వికలములు కాని అవయవములుగలది) అను నెడ ఆ శబ్దమునకు ఆ అర్థమే సిద్ధించుచుండగా వ్యంగ్యమైన అర్థము నిరాధారమైనదని శంకించుటయు తగదు. వ్యంగ్యమైన అర్థమునకు వ్యంజకమైన అర్థమునకును సంబంధము లేదు.

19-వ పేరా. న చ [illegible] ప్రసఙ్గప్రాప్తిమన్తరా అవికల జ్ఞేయస్య జ్ఞాపకత్వేన సర్వాఙ్గసంప్రాప్తిర్వ్యాపకమేవ దృష్టత్వేన చ కథం జ్ఞాప్యజ్ఞాపకయోస్సంబన్ధాభావ ఇతి వాచ్యమ్. గర్భస్థస్యైవ శిశోస్సప్తమసి మాసి యావదఙ్గసంపూర్తేస్సర్వైరప్యఙ్గీకృతత్వాత్ తథాచ శారీరే గర్భావక్రాన్తినామ సర్వైస్సర్వాఙ్గసంపన్నో భావైః పుష్యతి సప్తమే. గర్భోత్పాదితా దోషాస్తస్మిన్ హ్యవయవాస్థితా ఇతి—[illegible]

మహాదిచ్ఛార్ఙ్గదేవోఽపి సఙ్గీతరత్నాకరే ప్రథమాధ్యాయే పిణ్డోత్పత్తిప్రకరణే. షష్ఠేఽస్థి స్నాయునఖరోమకేశాలోమవివిక్తతా. అబద్ధా చోపచితా సప్తమే త్వఙ్గపూర్ణతేతి.

19-వ పేరా. అవయవములన్నియు, పరిపూర్ణముగ నేర్పడినంతవరకును, అవిక లాంగిత్వమును తెలిసికొన శక్యము కానందుచేతను, సర్వావయవపూర్తి యష్టమమునందే కనబడుచుండుటచేతను, వ్యాఖ్యావ్యాఖ్యేయములకు సంబంధము యెట్టు లేదని శంకింపరాదు. గర్భమందున్న శిశువునకు, యెనిమిదవనెలయందే సర్వాంగపరిపూర్తి యగునన్నది అందరి చేతను ఘోషింపబడుచున్నది. శారీరమునందు గర్భావక్రాంతీయమునందు ''యెనిమిదవ మాసమునందు సమస్త అవయవములతోకూడి సమస్తస్థానములతో శిశువు కలిగియుండు చున్నాడు; గర్భముచేత యేర్పడిన దోషములు హ్రాసమును పొందుచున్నవి.'' ఈ అర్థమునే సంగీతరత్నాకరమందు ప్రథమాధ్యాయమునందు పిండోత్పత్తి ప్రకరణము నందు శార్ఙ్గదేవుడుకూడా చెప్పియున్నాడు. 'ఆరవమాసమునందు అస్థులు, స్నాయువు గోళ్లు వెంట్రుకలు వ్యక్తము లగుచున్నవి. బలము, వర్ణము వృద్ధిపొందుచున్నవి. ఏడవమాసమునందు అవయవములు, పరిపూర్ణ మగుచున్నవి.

20-వ పేరా. న చాఙ్గాన్తర్గతస్తనపరిపూర్తేర్యౌవనవిషయత్వాదితి వాచ్యమ్. క్వచిదపి స్తనయోరఙ్గపరిగణనాగృహీతత్వేన ప్రత్యఙ్గపరిగణనపఠితత్వేనచాసమ్భవ ప్రసఙ్గాపత్తేః. తథాచ శారీరే అఙ్గవిభాగాధ్యాయే శిరోన్తరాధిర్ద్వౌ బాహూ సక్థినీ చ సమాసతః. షడఙ్గమఙ్గం ప్రత్యఙ్గం తస్యాక్షిహృదయాదికమితి శార్ఙ్గదేవోఽపి తస్మిన్నేవ ప్రకరణే ఖణ్డస్యాహుష్షడఙ్గాని శిరఃపాదౌ కరౌ తథా. మధ్యం చేతి తదస్యాని ప్రత్యఙ్గా న్యఖిలాన్యపీతి.

20-వ పేరా. అవయవములయందు చేరిన స్తనములయొక్క పరిపూర్తి యౌవనమునందే కల్గుచున్నదని శంకింపరాదు. ఎచ్చటను అంగపరిగణనయందు స్తనములు గ్రహింపబడకపోవుటచేతను ప్రత్యంగపరిగణనయందే పఠింపబడుటచేతను అసంభవము యేర్పడును. శారీరప్రకరణమునందు అంగవిభాగాధ్యాయమునందు "శిరస్సు నడుము రెండుబాహువులు పాదములు సంగ్రహముగ ఆరు అంగములు. కన్ను, హృద యము మున్నగునవి దేహమునకు ప్రత్యంగములు" శార్ఙ్గదేవుడుకూడా అదేప్రకరణమున "శిరస్సు పాదములు, చేతులు, నడుము అను ఆరును అంగములు తక్కినవి అన్నియు ప్రత్యంగములని చెప్పియున్నాడు."

21-వ పేరా. న చ స్నాయ్వాం నవశతీత్యుపక్రమ్య పేశీశతాని తు. అధికా వింశతిస్త్రీణాం యోనిస్తనసమాశ్రయా ఇత్యత్ర పేశ్యాశ్రయత్వేన స్త్రీణామసాధార ణాఙ్గత్వేన పరిగణనాత్. స్తనయోరఙ్గత్వమితి వాచ్యమ్. పురుషశరీరాపేక్షయా స్త్రీ శరీరస్య యోనిస్తనసమాశ్రయత్వేనాధికసఙ్ఖ్యయా వింశతిపేశ్యాశ్రయత్వప్రతిపాదకేనా

నేన స్తనయోరఙ్గత్వకథనస్యాన్యత్ర ప్రలపితత్వాత్ జాయమానశిశుదర్శనేనైవ స్త్రీశిశురితి సర్వైరపి జ్ఞాయమానత్వేన స్తనయోరసాధారణాఙ్గత్వకల్పనస్యాతీవానుచితత్వాచ్చ.

21-వ పేరా. "సన్నని నరములు తొమ్మిదివందలా అయిదు. పురుషులకు నూరు మాంసఖండములును స్త్రీలకు యోని స్తనములను ఆశ్రయించుటవలన నూట ఇరువై మాంసఖండములు గలవు కనుక" మాంసఖండముల కాశ్రయముగను అసాధారణాంగముగను పరిగణించుటవలన స్తనములు అంగమగుచున్నవని ఆశంకింపరాదు. ఈ వాక్యము పురుషశరీరమునకంటె స్త్రీశరీరమునందు యోని స్తనములు విశేషముగ నుండుటవలన అధికముగ స్త్రీల కిరువది మాంసఖండము లున్నట్లు చెప్పుచున్నది. కాని దీనితో స్తనములను అంగముగ చెప్పుటకిచ్చిగాని ప్రస్తావము వంటిది. పుట్టిన శిశువును చూడగనే స్త్రీ శిశువని యొందరిచేతనో గ్రహింప శక్యము కాకున్నది. గాన స్తనములను అసాధారణాంగముగ చెప్పుట చాల అనుచితము.

22-వ పేరా. నచాకేన స్తనయోరఙ్గత్వాభావేఽపి కాశీఖణ్డే స్త్రీలక్షణపరీక్షావసరే ఆదౌ పాదతలేత్యారభ్య కేశకలాపాన్తమాశిరా ఇత్యన్తేన ప్రతిపాదితానాం షట్షష్టిసఙ్ఖ్యాకానామఙ్గత్వకథనాత్తదన్తః పతితత్వాత్ స్తనయోరఙ్గత్వమస్త్వితి వాచ్యమ్. స్కాన్దోక్తషట్షష్టిసఙ్ఖ్యాకానామఙ్గత్వస్వీకారే అఙ్గలక్షణత్వేన మనునైవావ్యఙ్గాఙ్గీమితి వచనచతుర్థచరణోక్తమార్దవస్య స్కాన్దోక్తషట్షష్టిసఙ్ఖ్యాన్తర్గతానాం నఖగుల్ఫజానుకృకాటికాచుబుకదన్తాదీనామసమ్భవాపత్తేః స్తనద్రోమాణామపి తదన్తఃపాతిత్వాత్ అవ్యఙ్గాఙ్గీమిత్యనేనైవ నాలోమికాత్వే గృహీతే, నాలోమికాం నాతిలోమామితి మనువచనస్య వైయర్థ్యాపత్తేః స్తనవచ్చూచుకయోరప్యఙ్గత్వేన పరిగణనాదధికాఙ్గత్వఞ్చాపత్తేః తత్పరిపూర్తేరప్యావశ్యకతయా సువృత్తం చూచుకయుగం శస్తం శ్యామం సువర్తులమితి తల్లక్షణానురోధేనైవ శ్యామత్వవర్తులత్వాదేరజ్ఞాతత్వాత్ గర్భిణీ స్తనయోరభావాత్సఞ్జాతగర్భాయా ఏవ వివాహాపత్తేః. స్మితస్ఫుతయోరప్యఙ్గత్వమనుదాయకత్వాత్తయోరఙ్గత్వాపత్తేశ్చ.

22-వ పేరా. స్తనములు గాకపోయినను కాశీఖండమునందు స్త్రీ లక్షణములను పరీక్షించు నవసరమునందు మొదట పాదతలము నారంభించి పొవట వెంట్రుకలు అను నంతవరకు ప్రతిపాదింపబడిన అరువది ఆరింటిని అంగముగ చెప్పుటవలన వానియం దంతర్గతమగుటచే స్తనములు అంగమగునని శంకింపరాదు. స్కాందునిచే చెప్పబడిన యరువది యారింటికి అంగత్వమును స్వీకరించుపక్షమున అవ్యంగాంగీ యను అంగలక్షణమును పేర్కొను శ్లోకముయొక్క నాల్గవ పాదమునందు వ్రాయబడు అవయవములు గలదానినేయని మార్దవమును అంగమునకు చెప్పుటవలన స్కాందునిచే చెప్పబడిన అరువది యారింటిలో చేరిన నఖములు, చీలమండెను, మోకాళ్లు, పెడతల, గడ్డము, దంతములు, మున్నగువానికి అభావము యేర్పడవలసివచ్చును. స్తనములవలె రోమములుకూడా వాని యంతర్గతమైయున్నది. "అవ్యంగాంగీ" యను వచనముచేతనే రోమములు లేకయుండవలసినట్లు గ్రహింపబడినచో 'నాలోమికాం నాతిలోమాం" అను మనువచనము

చెప్పబడిన నాసికాదీంద్రియములు లేనివారికే వికలాంగకన్యలని గ్రహించబడెను. అంధాదులు అంగహీనులని లోకవ్యవహారము చెప్పబడినదిగాన పంచమహాభూతములని సృష్టిక లచే చేయబడిన శరీరశబ్దవ్యుత్పత్తి ముఖ్యమగునని మనువు ఇట్లు చెప్పినట్లు అనుసరించు యున్నది. మ. 1 అ. 15 శ్లో. "మనస్తత్త్వమును సత్త్వాదిత్రిగుణములతోఁ గూడిన శబ్దస్పర్శరూపరసగంధములకు గ్రాహకములైన శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియములను, వాగాది పంచకర్మేంద్రియములను, శబ్దాది పంచతన్మాత్రలను, సృజించెను" మ. 1 అ. 16 శ్లో. "ముందు చెప్పబడిన అహంకారమును శబ్దాది పంచతన్మాత్రలను అను నీ యారింటియొక్క సూక్ష్మావయవములను తన వికారముల యందు చేర్చి మనుష్య, తిర్యక్, స్థావరములు మున్నగు సమస్తభూతములను పరమాత్మ నిర్మించెను" మ. 1 అ. 17 శ్లో. "శరీరోత్పాదకములగు సూక్ష్మములయిన శబ్దాది తన్మాత్రలును, అహంకారమున్ను, అను నీ యారును ప్రకృతితోఁ గూడిన పరబ్రహ్మమునకు కార్యములగుచున్నవి. గాన ఆ పరబ్రహ్మముయొక్క స్వభావమునే పరిణామము నొందిన ఇంద్రియసహితమైన శరీరముగ జనులు చెప్పుచున్నారు. కాన నాసిక, జిహ్వ, నేత్రములు, కర్ణములు, కర, చరణములు, బుద్ధి అను ఇవియే అంగములు. ఇవి లేనివారే వికలాంగులు. అట్టి వికలాంగులను నివృత్తి చేయుటయే "అవ్యంగాంగీం" అను వచనాభిప్రాయము.

2౫-వ పేరా. యత్తూక్తం పరీక్షణీయ లక్షణాశ్రయభూమికాష్టకే గన్ధ స్వర యోర్బాల్యస్థయోర్యౌవనేపరావృత్తి ర్దృశ్యతే పరీక్షణీయతా యౌవనాగతయో రితి న్యాయ్యమితి తన్న ప్రమాణాభావాదనుభవవిరోధాచ్చ.

2౫-వ పేరా. పరీక్షింపవలసిన లక్షణములకు ఆశ్రయమగు ఎనిమిది భూమికల యందు "బాల్యమందున్నటువంటి వాసనకును, స్వరమునకును, యవ్వనమునందు మార్పు ఏర్పడుచున్నది. కాన యవ్వనమునందలి గంధస్వరములనే పరీక్షించుట న్యాయ్యమని చెప్పుట యుక్తము కాదు. ప్రమాణము లేదు. అనుభవమునకు విరుద్ధము. పద్మముల యొక్కగంధము గలది పద్మిని అను మున్నగు లక్షణములతోను విరోధమేర్పడుచున్నది.

26-వ పేరా. యత్తు స్వతస్సిద్ధ దృష్టమాత్రఫలకా సాఽవ్యఙ్గాఙ్గీమిత్యా దీనాం దృష్టార్థకత్వసాధనార్థం కేవల మదృష్టమాత్రైకఫలస్య మ. అ. ౫ శ్లో. అసపిణ్డా చయామాతురస గోత్రా చ యాపితుః సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథున ఇత్యస్యా ప్రసక్త క్షేత్రబీజస్యాయోపన్యాసేన దృష్టార్థకత్వముక్తం తన్న తస్యవచనస్య దృష్టార్థకత్వే ద్విజాతీనా మిత్యస్య వైయర్థ్యాపత్తేః స పిణ్డాది వివాహస్య ప్రాయశ్చిత్తోపదృష్టత్వాచ్చ తథా చ మనుః 11 అధ్యాయే 171-172 శ్లోకా, పైతృష్వ సేయీం భగినీం స్వస్రీయాం మాతురేవ చ. మాతుశ్చ భ్రాతు స్తనయాం గత్వా చాన్ద్రాయణం చరేత్. ఏతాస్తిస్రస్తు భార్యార్థే నోపయచ్ఛేత్తు బుద్ధిమాన్. జ్ఞాతిత్వేనాను పేయాస్తాః పతతి హ్యుపయన్నధ ఇతి.

26-వ పేరా. సహజముగ దృష్టఫలములుమాత్రమేగలిగిన "అవ్యంగాంగీ" మున్నగు లక్షణములకు దృష్టఫలమును సాధించుటకొరకు కేవలము అదృష్టఫలము కలిగిన

మ. 3 అ. 5 శ్లో. "తల్లికి సపిండురాలు కానిదియును తండ్రికి సగోత్రురాలు కానిదియు
నైన స్త్రీ ద్విజాతులకు వివాహమునకును అగ్న్యాధానాది కర్మలకును ప్రశస్తమైనది"
అను నీవచనమునకు ప్రసక్తముకాని క్షేత్రబీజన్యాయమును ఉపన్యసించుటచే దృష్ట
ఫలమును కల్పించుట యుక్తముకాదు. ఆవచనమునకు దృష్టఫలమును కల్పించినచో
ద్విజాతీనామనునది వ్యర్థము కావలసివచ్చును. సపిండాంగనలయొక్క వివాహమునకు
ప్రాయశ్చిత్తము చెప్పబడియున్నది. మ. 11 అ. 171 శ్లో. సోదరీస్థానీయురాలైన తండ్రి
సోదరి కొమార్తెయైనను, తల్లి సోదరి కొమార్తెయైనను తల్లి సోదరునియొక్క కుమార్తె
యైనను పొంది తద్దోషనివృత్తికి చాంద్రాయణవ్రత మాచరింపవలయును. మ 11
అ. 172 శ్లో. "ఈ చెప్పబడిన ముగ్గురిని బుద్ధిమంతుడు వివాహమాడరాదు. వారు
బంధువులుగాన వివాహమున కనర్హులు. వారిని వివాహమాడినవారు నరకమును పొందు
చున్నారు.

27-వ పేరా. నచ క్షేత్రబీజన్యాయవత్ ప్రజోత్పత్తివిషయే పితుర్జనక
స్యమాతృరక్తాంశతుల్యస్వభావకే రక్తే స్వరేతసశ్శక్తిః కిఞ్చిద్వ్యాప్రియమాణేతి వక్తుం
సుగమత్వాత్కథమస్య దృష్టార్థకత్వాభావ ఇతి వాచ్యమ్ స్వమాతృగామిషు పశ్వాదిష్వపి
సమీచీన ప్రజోత్పత్తేర్దృశ్యమానత్వాత్. (శివశివ)

27-వ పేరా. క్షేత్రబీజన్యాయమువలె సంతానోత్పత్తి విషయమునందును
తనకు సంబంధించిన తన తల్లియొక్క రక్తముయొక్క అంశముతోను సమానమైన
స్వభావమును కలిగిన రక్తమునందు తన రేతస్సుయొక్క శక్తి కొంచెము వినియోగపడు
చున్నదని చెప్పుటకు శక్యముగాన దీనికి దృష్టఫలముయొక్క లేదని శంకింపరాదు. తన
తల్లితో సంగమించు పశ్వాదులయందును శ్రేష్ఠమగుసంతతి యేర్పడుట చూడబడు
చున్నది. (శివశివ)

28-వ పేరా. నచ పశ్వాదిన్యాయో మనుష్యాణాం కథం సంగచ్ఛత ఇతి
వాచ్యమ్. జరాయుజానాం మనుష్యాణాం తదుక్తోద్భిజ్జక్షేత్రబీజసంపృక్త్యాపేక్షయా
జరాయుజపశ్వాదిసామ్యే కథమపి బాధాభావాత్.

28-వ పేరా. పశ్వాదిన్యాయము మనుష్యుల కెట్లు తగునని శంకింపరాదు.
జరాయువువలన పుట్టు మనుష్యులకు నీ చెప్పబడిన ఉద్భిజ్జాది క్షేత్రబీజసాదృశ్యమున
కంటే జరాయుజ పశ్వాది సామ్యమునందు బాధకము లేదు.

29-వ పేరా. నచ మ. 9 అధ్యాయే. క్షేత్రభూతా స్మృతా నారీ బీజ
భూతస్స్మృతః పుమాన్ క్షేత్రబీజసమాయోగాత్సంభవస్సర్వదేహినామితి. క్షేత్రబీజ
న్యాయోఽస్య మనునైవోక్తత్వాదితి వాచ్యమ్. బీజయోన్యోః క్వచిద్బీజస్య. క్వచిద్యోనేః
ప్రధానత్వేన. స్వక్షేత్రే పరబీజోత్పన్నస్య. పరక్షేత్రే స్వబీజోత్పన్నస్యవా. పుత్రేణ
పరస్య స్వస్య చ పిణ్డోదకదానాదిరూపఫలాభావాత్స్వపరక్షేత్రరక్షణవిష
యక ఏవ [illegible] మనునా క్షేత్రబీజన్యాయస్యోక్తత్వాత్.
తథాచ మను. 9 అ. [illegible] శ్లో. బీజస్య చైవ యోన్యాశ్చ బీజముత్కృష్టముచ్యతే.

సర్వభూతప్రసూతిర్హి బీజలక్షణలక్షితా. ఫలం త్వనభిసంధాయ క్షేత్రిణాం బీజినాం తథా, ప్రత్యక్షం క్షేత్రిణామర్థో బీజాద్యోనిర్గరీయసీ. మ. 9 అ. 36-49 శ్లో. యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే, తాదృగ్రోహతి తత్తస్మిన్బీజం స్వైర్వ్యఞ్జితం గుణైః. తథైవాక్షేత్రిణో బీజం పరక్షేత్రప్రవాపిణః కుర్వన్తి క్షేత్రిణామర్థం న బీజీ లభతే ఫలమ్. మ. 9 అ. 9 శ్లో. 41 శ్లో. యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధమ్. తస్మాత్ప్రజావిశుద్ధ్యర్థం స్త్రియం రక్షేత్ప్రయత్నతః. తత్ప్రాజ్ఞేన వినీతేన జ్ఞానవిజ్ఞానవేదినా. ఆయుష్కామేన వప్తవ్యం న జాతు పరయోషితి — కించ-తృతీయాధ్యాయ కన్యాలక్షణనిరూపణప్రస్తావగతస్యాసపిణ్డా చ యా మాతురిత్యేతద్వచనస్య నవమాధ్యాయస్త్రీపుంధర్మాంతర్గతస్య మాతాపిత్రోస్సుతస్వామ్యప్రతిపాదనసాధనత్వేనోపాత్తస్య క్షేత్రబీజన్యాయప్రతిపాదకస్య క్షేత్రభూతా స్మృతా నారీత్యేతద్వచనస్య చాత్ర సఙ్గతేరేవాభావాత్.

29-వ పేరా. మ. 9 అ. "స్త్రీ క్షేత్రముగను, పురుషుడు బీజముగను, చెప్పబడెను. క్షేత్రబీజములయొక్క సంబంధముచే సమస్తప్రాణులకు జన్మమేర్పడుచున్నది అని" క్షేత్రబీజన్యాయము మనువుచేతనే చెప్పబడియున్నది. బీజక్షేత్రములలో నొకయెడ బీజము, మరియొకయెడ యోనియు ప్రధానమగుచుండుటచే తనక్షేత్రమునందు పరునిబీజముచే జన్మించినటువంటిన్ని, పరునిక్షేత్రమునందు తనబీజముచే జన్మించినట్టి పుత్రునిచే పరునికి తనకును వానిచే నేర్పడు ఋణవిమోచనాది రూపఫలము లేనందువలన స్వక్షేత్రమును రక్షించుకొనుటయందు, పరక్షేత్రమును విసర్జించుకొనుటయందే పురుషునకు పరమధర్మము. అను విషయంకముకొరకే మనువుచే క్షేత్రబీజన్యాయము చెప్పబడియున్నది. మ. 9 అ. 35 శ్లో. బీజమునకును, యోనికిని మధ్య బీజము ఉత్కృష్టమైనది. ఎందుకనగా సమస్తజంతువుల సృష్టి బీజముయొక్క స్వభావముతోనే కూడియున్నది. మ. 9 అ. 52 శ్లో. 'క్షేత్రస్వామియు, బీజియు నొడంబడిక యేర్పరచుకొనక క్షేత్రమునందు ఉత్పత్తి చేయబడినవస్తువు క్షేత్రస్వామికే చెందును' ఎందుకనగా బీజమునకన్న క్షేత్రము ప్రధానమైనది. మ. 9 అ. 36 శ్లో. అనుకూలమగు కాలమునందు క్షేత్రమునందు యెటువంటిబీజము నాటబడుచున్నదో అటువంటి బీజముతో కూడిన అంకురము ఉత్పత్తియగుచున్నది." మ. 9 అ. 49 శ్లో. "అవ్విధముగనే పరక్షేత్రమునందు నాటబడు క్షేత్రస్వామి కానివానియొక్క బీజము క్షేత్రస్వాములకే ప్రయోజనమును కల్పించుచున్నది." గాని బీజి ఫలమును పొందుటలేదు. మ. 9 అ. 9 శ్లో. "స్త్రీ యెటువంటి పురుషుని పొందుచున్నదో అటువంటి పుత్రునే కనుచున్నది కాన సంతతి శుద్ధికి స్త్రీని ప్రయత్నముతో రక్షింపవలయును." మ. 9 అ. 41 శ్లో. "సహజమైన ప్రతిజ్ఞ కలిగి పిత్రాదులచే అనుశిష్టుడైన వేదవేదాంగములను నేర్చినటువంటి ఆయుష్కామునిచే పరక్షేత్రమునందు బీజావాపము చేయతగదు." మరియు మ. 3 అధ్యాయమునందు కన్యాలక్షణ నిరూపణ సందర్భమున చెప్పబడిన (అసపిణ్డాచయామాతుః) అనువచనమునకు 9 వ అధ్యాయమునందు స్త్రీ పురుష

ధర్మములయం దంతర్గతమైనట్టి వంటివిన్ని తల్లిదండ్రులకు సమ స్వామ్యమును ప్రతిపాదించుటకు సాధనముగ చెప్పబడిన క్షేత్ర బీజన్యాయమును ప్రతిపాదించు 'క్షేత్రభూతా స్మృతా నారీ' మున్నగు వచనములకు సంబంధము లేకపోవును.

30-వ పేరా. యత్తూక్తం క్షేత్రాన్వయమపేక్ష్య బీజాన్వయస్య ప్రాబల్యాదుక్తమసగోత్రా చ యా పితురితి. పితురసగోత్ర సపిణ్డాపి న వోఢవ్యైవ ఉక్తన్యాయస్యాత్రానపాయాదితి చ తదప్యసత్ సాక్షాత్పితృవ్యసుతాపరిణేతృష్వేచ్ఛాదిషు సమీచీన ప్రజోత్పత్తేరనపాయాత్ (మృత్యుఞ్జయ.)

30-వ పేరా. క్షేత్రాన్వయమునకంటె బీజాన్వయమునకు ప్రాబల్యము కాన వివాహప్రకరణమునందు వివాహ్యయగు కన్యక (అసగోత్రా చయాపితుః అని) అసగోత్రురాలుగను, అసపిండురాలుగను నుండవలయునని చెప్పబడిన న్యాయముగూడ నిట ప్రవర్తించుచున్నదని చెప్పుటతగదు. తండ్రి సోదరునికుమార్తెలను వివాహము ఆడు మ్లేచ్ఛులు మున్నగువారియందును ఉత్తమమైనసంతతి యేర్పడుచున్నది. (మృత్యుంజయ)

31-వ పేరా. యత్తూక్తం అతో ఽసపిణ్డా చేత్యాదినా మాతృసపిణ్డావివాహనిషేధస్య దృష్టమూలకతైవేతి-తదప్యసత్ - ప్రాయశ్చిత్తోపసృష్టత్వాత్ - మాతులకన్యాపరిణేతృష్వాన్ధ్రాదిషు సమీచీనప్రజోత్పత్తేర్దృశ్యమానత్వాత్-దత్తోత్తరత్వాన్నిరస్తత్వాచ్చ. (శివ పాహి.)

31-వ పేరా. అసపిండాచ ఇత్యాది వచనముతో తల్లియొక్క సపిండాదులతో వివాహనిషేధమునకు మూలము దృష్టమని చెప్పుటయుతగదు. ప్రాయశ్చిత్తముతో నది కూడినది. మామకుమార్తెను పరిణయమాడు ఆంధ్రాదులయందును, మంచిసంతతి యేర్పడుట చూడబడియుండుటవలనను వెనుక ఇయ్యబడిన సమాధానములచేతను నది నిరసింపబడియున్నది. (శివ పాహి.)

32-వ పేరా. యత్తూక్తం అతఏవ యాజ్ఞవల్క్యస్మృతావాచారకాణ్డే వివాహప్రకరణే అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్ అనన్యపూర్వికాం కాన్తామసపిణ్డాం యవీయసీమితి శ్లోకవ్యాఖ్యాయాం వివాహ్యకాన్తావిశేషణభేదప్రతియోగితావచ్ఛేదకం సాపిణ్డ్యం రక్తాన్వయరూపమేవ న నిర్వాప్యపిణ్డాన్వయరూపమితి వ్యాచఖ్యౌ విజ్ఞానేశ్వరయోగీతి తదప్యసత్ విజ్ఞానేశ్వరయోగినా స్వజనకస్వమాతృరక్తాంశతుల్యస్వభావకే స్వరేతసః శక్తివ్యాఘాతరూపదృష్టఫలత్వస్యానుక్తత్వాత్ రక్తాన్వయరూపమిత్యనేన ప్రతీయమానత్వాచ్చ సాపిణ్డ్యం రక్తాన్వయరూపమేవ. న నిర్వాప్యపిణ్డాన్వయరూప్యమితి. సాపిణ్డ్యమిత్యత్ర విజ్ఞానయోగికృతవ్యాఖ్యయా మాతులపితృవ్యాదిసన్తానస్యాపి సాపిణ్డ్యసమ్పాదనమాత్రఫలకత్వాచ్చ.

32-వ పేరా. యాజ్ఞవల్క్యస్మృతియం దాచారకాండమందు వివాహప్రకరణమున "అస్ఖలితబ్రహ్మచర్యము కలిగినటువంటి పురుషుడు ఇతరునకు వాక్కుచేత గూడా దానముచేయబడని అసపిండురాలై తనకు నప్రియమైన తనకన్న వయస్సునందు

చిన్నదియగు లక్షణవతియైన స్త్రీని వివాహమాడవలయును." అను శ్లోక వ్యాఖ్యయందు వివాహముచేయదగిన కాంతకు విశేషణమైన భేదములో ప్రతియోగితావచ్ఛేదకమైన సపిండత్వము రక్తముతో సన్వయించు ధర్మము కలిగినదేగాని నిర్వాపముచేయతగిన పిండముతో సన్వయించుధర్మము కలిగినది కాదని విజ్ఞానేశ్వరయోగి వివరణము చేసెనని చెప్పుటయుం దగదు. విజ్ఞానేశ్వరయోగిచే తనకు సంబంధించిన తన తల్లియొక్క రక్తముతో తుల్యమయిన స్వభావముకలిగిన రక్తమునందు తన రేతస్సుయొక్క శక్తికి ప్రతిఘాతరూపమైన దృష్టఫలము ఏర్పడు నని చెప్పబడలేదు. కాన ఈ అనుకిందత్వము రక్తాన్వయరూప ప్రతియోగితావచ్ఛేదకధర్మమును కలిగినదియని దీనిచే తెలియుటలేదు. సపిండత్వము రక్తాన్వయరూపమేగాని నిర్వాపము చేయతగిన పిండాన్వయరూపము కాదని సాపిండ్యమునునెడ విజ్ఞానేశ్వరయోగిచే చేయబడిన వ్యాఖ్యానముయొక్క సంతానమునకును, తండ్రి సోదరుల సంతానమునకును సపిండత్వమును కల్పించుటయే ప్రయోజనముగా గలిగియున్నది.

33-వ పేరా. యత్తూక్తమన్యగోత్రదత్తస్య జనకగోత్రనివృత్తావపి - జనకపితృసగోత్ర జనకమాతృసగోత్ర, జనకమాతృసపిండాదిదేవనభట్టోక్తవివాహనిషేధస్యాపి దృష్టఫలమూలకత్వమితి తదప్యసఙ్గతం అన్యగోత్రాయ దత్తస్యైవ జనకస్య తు. గోత్రే న వివహేత్కన్యాం తత్పుత్రాదేర్న దోషకృదిత్యాదివచనైరన్యగోత్రదత్తకస్య స్వపితృజనకపితృసగోత్రసపిండాసు స్వపితృరక్తాన్వయస్య విద్యమానత్వేఽపి తాదృశసపిండాదికన్యావివాహే దోషాభావస్య విధీయమానత్వాత్.

33-వ పేరా. మరియొకగోత్రమునకు సంబంధించిన దత్తపుత్రునకు తన గోత్రము తొలగిపోయినను తనకు జనకుడైన తండ్రికి సగోత్రురాండ్రగు స్త్రీలతోను, జనకురాలగు తల్లితో సపిండాదులగు స్త్రీలతోను దేవనభట్టుచే చెప్పబడిన వివాహనిషేధమునకు మూలము దృష్టఫలమే యనుటయుం దగదు. అన్యగోత్రమునకు దత్తుడైనవాడే తన జనకుని గోత్రమునందలి కన్యను వివాహమాడరాదు. అతని పుత్రాదులకు అది దోషమును కలిగించదు. ఇవి మున్నగువచనములలో అన్యగోత్రమునకు సంబంధించిన దత్తపుత్రునియొక్క పుత్రులవిషయమున తమ తండ్రికి జనక జనకుడగు తండ్రియొక్క సగోత్ర సపిండాదులవిషయమున పితృరక్తాన్వయము మున్నప్పటికిని అట్టి సపిండాదికన్యావివాహమునందు దోషములేదనియే చెప్పబడియున్నది.

34-వ పేరా. యత్తు మాతృసపిండాదివివాహమపేక్ష్య దమ్పత్యోః పరస్పరమనోఽనన్వయస్య బుద్ధిధైర్యబలాద్యుపబృంహితప్రజోత్పత్తౌ ప్రబలవిరోధిత్వాత్తయోః పరస్పరానుగుణ్యేనైవ వివాహః కార్యః ఇత్యుక్తం తదప్యయుక్తం. పరస్పరానురక్తయోస్సదా వివదమానయోరప్యనన్యాసక్తయోర్దమ్పత్యోస్సమీచీనప్రజోత్పత్తేర్దృశ్యమానత్వాత్.

34-వ పేరా. మాతృసపిండాది వివాహములకంటెను దంపతులకు పరస్పరము మనస్సులు కలియకపోవుట బుద్ధిధైర్యములతో గూడిన సంతానోత్పత్తికి ప్రబలమైన ప్రతి

36-వ పేరా. తాదృశవాగాడమ్బరస్య మూలభూతం శిరసి భ్రమరగుహాయాం రేతసోఽవస్థానకల్పనమతీవాసఙ్గతమ్. తస్య శిరోఽవస్థానస్య న క్వాపి శరీరతత్త్వప్రతిపాదకేషు గ్రన్థేష్వనుక్తత్వాత్. స్త్రీపుంసయోర్గర్భాశయాన్తర్గతకణ్టకాశయాణ్డకోశా వేవ శోణితశుక్లస్థానే ఇత్యుక్తత్వాచ్చ తథాచాయుర్వేదసారే స్త్రీపుంసయోశ్శోణితశుక్లయోశ్చ. స్థానే హి గర్భాశయముష్కకోశావితి శీర్షస్థస్య ప్రాణాఖ్యస్య వాయోశ్శుక్లాదినిష్క్రమణక్రియావత్త్వస్యాకథితత్వాత్ అపానస్థస్యైవ వాయోశ్శుక్లాదినిష్క్రమణక్రియావత్త్వస్య కథితత్వాచ్చ తథాచ జీవరక్షామృతే ప్రథమాధ్యాయే ప్రాణాదిభేదాత్పఞ్చాత్మా వాయుః ప్రాణోఽత్ర మూర్ధగః. ఉరఃకణ్ఠచరో బుద్ధిహృదయేన్ద్రియచిత్తధృక్. ష్ఠీవనక్షవథూద్గారనిశ్వాసాన్నప్రవేశకృదితి అపానోఽపానగశ్శ్రోణివస్తిమేఢ్రోరుగోచరః. శుక్లార్తవశకృన్మూత్రగర్భనిష్క్రమణక్రియ ఇతి కించ ముష్ణాతి గోపాయతి రేత ఇతి ముష్కః—వర్షతి రేత ఇతి వృషణః వృషో ధర్మోక్షపుంభేదే రేతశ్శ్రేష్ఠాఖువాజిష్వితి నానార్థరత్నమాలాయాం వృషశబ్దస్య రేతోవాచకత్వేన ప్రతిపాదనాద్వృషం శుక్లం నయతి మేఢ్రద్వారమితి చ వృషణ ఇతి ముష్కవృషణశబ్దవ్యుత్పత్త్యైవ రేతస్తత్రైవ తిష్ఠతీతి జ్ఞాతుం సుగమత్వాత్ బాల్యఏవ షణ్డీకరణేన పుంపశ్వాదీనాం చ షణ్ఢత్వస్య కణ్డకోశయోశ్ఛేదేన సాధనీభూతౌషధవిశేషైః స్త్రీణాం బడబాదీనాం చ వన్ధ్యాత్వస్య చ సర్వసంప్రతిపన్నత్వాచ్చ.

36-వ పేరా. అట్టివాగాడంబరమునకు మూలమైనది శిరస్సు. భ్రమరగుహయందు రేతస్సునకు స్థితినికల్పించుట ఇది చాల అసంగతమైనది. అది శిరస్సునందున్నట్టు శరీరతత్త్వమును ప్రతిపాదించు గ్రంథములయందు చెప్పుట ప్రతిపాదించలేదు. స్త్రీపురుషుల యొక్క గర్భాశయమునందుండు కంటకాశయాండకోశములే శోణితములకును శుక్లమునకు స్థానములని చెప్పబడియున్నవి. ఆయుర్వేదసారమునందు స్త్రీపురుషులకు శోణితశుక్లములకు గర్భాశయ అండకోశములు స్థానములు అని శిరస్సునందున్న ప్రాణవాయువు శుక్లాదులను వెలుపలికి ప్రవహింపజేయు క్రియను కలిగియున్నట్టును చెప్పబడలేదు. అపానమందున్న వాయువునకే శుక్లాదులను వెడలించు క్రియ చెప్పబడియున్నది. గను కనే జీవరక్షామృతమందు మొదటి అధ్యాయమున ప్రాణాదిభేదమువలన వాయువు అయిదువిధములు. ఇందు ప్రాణము శిరస్సునందున్నది. వక్షస్స్థలమునందును, కంఠము నందును సంచరించుచున్నది. బుద్ధి, హృదయ, ఇంద్రియచిత్తములను ధరించుచున్నది. ఉమ్మివేయుట, తుమ్ము, ధూత్కారము, నిట్టూర్పు అన్నప్రవేశములను చేయుచున్నది. అపానవాయువు అపానమునందుండి పిరుదులయందును, వస్తియందును, మేఢ్రము నందును, తొడలయందును గోచరించుచున్నదై శుక్లమును, ఋతురక్తమును, మలమును, మూత్రమును, గర్భమును వెడలింపజేయుచున్నది. మరియు రేతస్సును, ముష్ణాతి, అనగా (రక్షించుచున్నది) కాన ముష్కము. రేతస్సును వర్షించుచున్నది గాన వృషణము. నానార్థరత్నమాలయందు వృషశబ్దము రేతోవాచకముగ చెప్పబడినది గాన వృషము. శుక్లమును నయతి మేఢ్రద్వారమును పొందించుచున్నదని వృషణము అని

వృషణశబ్దవ్యుత్పత్తి ఇట్లు యున్న, వృషణ, శబ్దవ్యుత్పత్తిచేతనే రేతస్సందు ఉన్నదని సులభముగ తెలియ శక్యము. బాల్యమునందే అండము పిండీభావము (నుద్దకట్టుగొను ట)ను పొందుటచే పురుషులకును గుఱ్ఱములకును షండత్వము (నపుంసకత్వము) కంటకాళయమును ఛేదించుటకు సాధనములగు ఔషధవిశేషములచే స్త్రీలకును, ఆడ గుఱ్ఱములకును, వంధ్యాత్వము (గొడ్డుపోతుతనము) ఏర్పడుచున్నదని అందరిచేత సంగీక రింపబడుచున్నది.

37-వ పేరా. యత్తూక్తం రేతసో దశవర్షానన్తరం గుహ్యదేశప్రాప్తిః తదానీ మేవ తత్ర లోమోద్భవ ఇతి తన్న గుహ్యదేశస్థితస్యైవ రేతసో దశవర్షానన్తరం గుహ్యదేశప్రాప్తిరిత్యుక్తేరున్మత్తప్రలపితత్వాత్ షష్ఠ ఏవ మాసి గర్భస్థస్యైవ శిశోర్లోమో ద్యుత్పత్తేశ్శివగీతాదిసకలగ్రన్థైః ప్రతిపాదితత్వాచ్చ తథాచ శివగీతాష్టమాధ్యాయే ప్రబుద్ధం పఞ్చమే చిత్తం మాంసశోణితపుష్టతా. షష్ఠేస్థిస్నాయుసఖరకేశలోమవివిక్త తేతి తథైవ శారీరే గర్భావక్రాన్తీయే, షష్ఠే స్నాయుశిరోరోమబలవర్ణనఖత్వచామ్. తథైవ శార్ఙ్గదేవోఽపి సంగీతరత్నాకరే ప్రథమాధ్యాయే పిణ్డోత్పత్తిప్రకరణే, షష్ఠే స్థిస్నాయుసఖరకేశలోమవివిక్తతేతి.

37-వ పేరా. పదిసంవత్సరములకుతర్వాత రేతస్సు గుహ్యదేశమును (మేఢ్ర స్థానమును) పొందుచున్నది. అప్పుడే అచ్చట రోమము లేర్పడుచున్నవి అనిచెప్పుట యుక్తము కాదు. గుహ్యదేశమునందున్న రేతస్సు పదిసంవత్సరములకుపిదప గుహ్యదేశ మును పొందుననుట ఉన్మత్తప్రలాపము. ఆరవమాసమునందే గర్భమునందలి శిశువునకు రోమములేర్పడుట శివగీత మొదలగు గ్రంథములచే చెప్పబడియున్నది గనుకనే శివ గీతాష్టమాధ్యాయమున “ఐదవమాసమునందు చిత్తమునకు ప్రబోధము మాంసశోణిత ములకు పుష్టియు ఆరవమాసమునందు అస్థులు, స్నాయువు, నఖములు, కేశములు, రోమ ములు వ్యక్తములగుచున్నది.” అవ్విధముగనే శారీరమున గర్భావక్రాంతీయమునందు “ఆరవమాసమున స్నాయువును, శిరోరోమములు, బలము, వర్ణము, గోర్లు, చర్మము ఏర్పడును.” అని అవ్విధముగనే శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకర ప్రథమాధ్యాయము నందు పిండోత్పత్తిప్రకరణమునందు “ఆరవమాసమున అస్థులు, స్నాయువు, నఖములు, కేశములు, రోమములు వ్యక్తములగుచున్నవని చెప్పబడినది.

38-వ పేరా. యత్తు భారతవచనప్రతిపాదితశిరోగతస్యాగ్నే రేతఃపరత్వేనార్థ వర్ణనం కృతం తన్న పిత్తస్యైవ తైజసగుణోదయాత్పాకాదికర్మణా చానలశబ్దవాచ్య త్వమితి సకలశారీరగ్రన్థైరుద్ఘోషితత్వేన తస్య పిత్తపరత్వేనైవ వర్ణనీయత్వాత్ తథాచ జీవరక్షామృతే ప్రథమాధ్యాయే, పఞ్చభూతాత్మకత్వేఽపి య త్తైజసగుణోదయాత్. నక్తంపిత్తం పాకాదికర్మణానలశబ్దితమ్. వచత్యన్నం విభజతే సారకిట్టౌ పృథక్తథేతి తథాచ వైద్యగ్రన్థే అగ్నిః పిత్తం పిత్తమగ్నిరితి.

38-వ పేరా. భారతవచనముచే ప్రతిపాదింపబడిన శిరస్సునందున్న యగ్నిని చేతస్సుగ చెప్పుట తగదు. తేజోగుణ మేర్పడుటవలన పాకాదికర్మ చేతను పిత్తమే అనల శబ్దముచే చెప్పబడుచున్నదని సకల శారీరకగ్రంథములచేతను ప్రతిపాదింపబడియున్నది. కాన దానిని పిత్తముగనే చెప్పవలయును. కాననే జీవరక్షామృతమునందు మొదటి యధ్యాయమున పంచభూతాత్మకమగునన్నను దృక్పాత పాకాదికర్మ అనలశబ్దముచే చెప్పబడుచున్నది. అన్నమును పక్వముచేయునదియు, సారకిట్టమునందు అన్నమును విభజించునదియు అని వైద్యగ్రంథమున అగ్నియే పిత్తము, పిత్తమే అగ్నియని చెప్ప బడినది.

39-వ పేరా. నచ పక్వామాశయమధ్యస్థితస్య జాఠరాగ్నిశబ్దవాచ్యస్య పాచక పిత్తస్య కథం శిరస్స్థానస్థితానలశబ్దవాచ్యతేతి వాచ్యమ్ తస్యానలశబ్దవాచ్యస్య పిత్తస్య పాచకరఞ్జకసాధకాలోచకభ్రాజకభేదేన పక్వాశయామాశయమధ్య, ఆమాశయ, హృదయ, అక్షి, శిరః ప్రభృతిసర్వశరీరవ్యాపిత్వగిన్ద్రియాశ్రయత్వేన సర్వత్ర ప్రతి పాదితత్వాత్ జీవరక్షామృతే తస్మిన్నేవాధ్యాయే పిత్తం పఞ్చాత్మకం తత్ర పక్వా మాశయమధ్యగం. తత్రస్థమేవ పిత్తానాం శేషాణామప్యనుగ్రహమ్. కరోతి బలదానేన పాచకం నామ తత్స్మృతమ్ ఆమాశయాశ్రయం పిత్తం రఞ్జకం రసరఞ్జనాత్, బుద్ధి మేధాభిమానాద్యై రభిప్రేతార్థసాధనాత్, సాధకం హృద్గతం పిత్తం రూపాలోక నతస్స్మృతమ్. దృక్స్థమాలోచకం పిత్తం త్వక్స్థం భ్రాజకమిష్యతేతి.

39-వ పేరా. పక్వాశయముయొక్కయు, ఆమాశయముయొక్కయు మధ్య యున్నదియు, జఠరాగ్నిశబ్దముచే చెప్పబడు అన్నమును పక్వముచేయు పిత్తము శిరస్స నందున్న అనలమునకు వాచకమగు శబ్దముచే నెట్లు చెప్పదగును అని శంకింపరాదు. అనలశబ్దముచే చెప్పబడు పిత్తము పక్వాశయమునందు పాచకమనియు, ఆమా శయపు మధ్యమునందు రంజకమనియు. ఆమాశయమునందు సాధకమనియు, హృదయమునం దాలోచనమనియు, అక్షియందు భ్రాజకమనియు భేదముచే శిరస్సు మొదలు సమస్తశరీర మును వ్యాపించిన త్వగింద్రియమును ఆశ్రయించుచున్నట్లు అంతట చెప్పబడియున్నది. జీవరక్షామృతమునందు ఆ అధ్యాయమునందే పిత్తము అయిదువిధములు. పక్వాశయము యొక్కయు, ఆమాశయముయొక్కయు మధ్యమును పొందియున్నదియు అచ్చట నుండియే శేషములయిన పిత్తములకు బలమునొసంగుటచే సహాకారమును చేయునది పాచకమని చెప్పబడినది. ఆమాశయము నాశ్రయించిన పిత్తము రసముచే రంగు వేయుటవలన రంజకమనియు, బుద్ధి, మేధా, అభిమానము మున్నగువానిచే ఇష్టమైన అర్థమును సాధించుటవలన సాధకమనియు, హృదయమందున్న పిత్తము నేత్రమునం దుండి రూపమును చూచుటవలన ఆలోచనమనియు, త్వగింద్రియమం దుండుటవలన భ్రాజకమనియు చెప్పబడినది.

40-వ పేరా. యదుక్తం చేతసోఽగ్నిత్వముష్ణస్పర్శాశ్రయత్వాదితి మన్తవ్య మితి తన్న మూత్రపురీషాదీనాం ధాతుమలానాం సర్వేషామప్యుష్ణస్పర్శాశ్రయత్వాత్

ప్రత్యక్షసిద్ధత్వేన తేషామప్యగ్నిశబ్దవాచ్యత్వాపత్తేః. ఇత్థం చైతాదృశవాగాడమ్బరమూలభూతస్య శిరసి భ్రమరగుహాయాం రేతసోఽవస్థానమిత్యస్య స్వకపోలకల్పితశుష్కయుక్తియుక్తస్య నిష్ప్రమాణవాదస్య సయుక్తికప్రమాణోపన్యాసైరుత్సారితత్వేన, తదనుసారిణాం స్వాభాసయుక్తిమాత్రశరణానాం లోకశాస్త్రవిరుద్ధానాం వాదానాం ఖణ్డనస్యావశ్యకత్వేన, అలం దుర్బలపీడనేనేతి న్యాయమవలమ్బ్య చ సంక్షేపయామః.

40-వ పేరా. ఉష్ణస్పర్శము నాశ్రయించుటవలన రేతస్సు అగ్నియగుచున్నదని తలంపతగదు. ధాతుమలములయిన మూత్రపురీషాదులకును ఉష్ణస్పర్శము ప్రత్యక్షసిద్ధముగాన వానికిగూడా అగ్నిశబ్దవాచ్యత్వము ఏర్పడవలసివచ్చును. ఇటువంటి వాగాడంబరమునకు మూలమయిన "శిరస్సునందు భ్రమరగుహలో రేతస్సునకు ఉనికిని స్వకపోలకల్పితములయిన శుష్కయుక్తులతోగూడిన ప్రమాణరహితమైన వాదమును సయుక్తికములగు ప్రమాణముల నుపన్యసించుటచే నిరసించుటవలన ఆవాదము ననుసరించు శ్రేష్ఠములుగ పైకికనబడు యుక్తులమాత్రమే శరణముగాగల లోకశాస్త్రవిరుద్ధములయినవాదములను ఖండింప ననవసరమగుటచే బలహీనులను పీడింప నవసరములేదు అను న్యాయము ననుసరించియు సంగ్రహించెదము.

41-వ పేరా. యత్తు ప్రకృతమనుసరామ ఇత్యారభ్య సానన్దజనకమిత్యన్తం అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్ అనన్యపూర్వికాం కాన్తామసపిణ్డాం యవీయసీమితి యాజ్ఞవల్క్యవచనస్య విజ్ఞానయోగినా స్త్రియమిత్యస్య స్త్రీత్వేన పరీక్షితామనన్యపూర్వికామిత్యస్య దానేనోపభోగేన వా పురుషాన్తరాపరిగృహీతాం కాన్తామిత్యస్య ఓఢుర్మనోనయనానన్దకారిణీమితి చ వ్యాఖ్యాతత్వేన, రజస్స్తనయోర్వా ఉద్భేదాఽభావే స్త్రియాః స్త్రీత్వస్య జ్ఞాతుమశక్యత్వాత్ బాలాయా ఉపభోగానర్హతయా ఉపభోగేన వా పురుషాన్తరాఽపరిగృహీతామితి విశేషణస్య వైయర్థ్యాపత్తేః అనుద్బుద్ధస్త్రీలక్షణాయా ఓఢుర్మనోనయనానన్దకరత్వాభావాచ్చ యాజ్ఞవల్క్యస్య యువతీవివాహ ఏవాభిప్రేత ఇత్యుక్తం తదయుక్తమ్. అప్రయచ్ఛన్సమాప్నోతి భ్రూణహత్యామృతావృతావితి, యువతీవివాహనిషేధబోధకస్య తస్యైవ యాజ్ఞవల్క్యవచనస్య సాక్షాద్విరుద్ధత్వాత్ నపుంసకత్వవ్యావృత్తయే స్త్రీత్వేన పరీక్షితామిత్యత్ర కేవల స్త్రీత్వేన పరీక్షితామితి ప్రమాణస్య పరప్రతారణైకపరత్వాత్ నపుంసకవ్యావృత్తేస్తు బాహ్యలోకధాతుపరీక్షయా వా జాతకభావైర్వా జ్ఞాతుం సుకరత్వాత్ స్త్రియాః స్త్రీత్వం రజస్స్తనయోర్వా అనుద్భేదే జ్ఞాతుమశక్యమితి చేత్ గర్భాష్టమ ఏవ స్త్రీణాం వివాహః కార్య ఇత్యుక్తవతాం మన్వాదీనాం/ స్త్రీణాం వివాహస్యోపనయనస్థానీయత్వముక్తవతో విజ్ఞానయోగినోఽపి మాధవప్రగ్రన్థకర్తుర్వారైవ బాలాయా ఉపభోగానర్హతాయాః అనుద్బుద్ధస్త్రీలక్షణాయా ఓఢుర్మనోనయనానన్దకరత్వాభావస్య చ ప్రథమపరిహారేణైవ దత్తోత్తరత్వాచ్చ.

41-వ పేరా. ప్రకృతమనుసరామః యని ఆరంభించి సానందజనకం అను నంతవరకు అస్ఖలితబ్రహ్మచర్యము గలవాడై అనన్యపూర్వికయు, కాంతయు, అస

పిండకయు, చిన్నదియు, లక్షణవతియు అయిన స్త్రీని వివాహమాడవలయును. అను యాజ్ఞవల్క్యుని వచనమునకు విజ్ఞానయోగి స్త్రియ మను శబ్దమునకు స్త్రీత్వధర్మముచే పరీక్షింపబడినదియు, అనన్యపూర్వికా యను శబ్దమునకు దానముచేతగాని, సంభోగము చేతగాని మరియొకపురుషునిచే పరిగ్రహింపబడనిదియు, కాంతా యను శబ్దమునకు వివాహము చేసుకొనువాని మనస్సునకు నేత్రములకు ఆనందమును కలిగించునదియని వ్యాఖ్యానముచేయుటవలన రజస్సునకుగాని, స్తనములకుగాని ఉద్భేదములేనిచో స్త్రీయందలి స్త్రీత్వమును తెలిసికొనుటకు శక్యముకానందువలన బాల సంభోగమున కనర్హురాలగుటచే సంభోగముచేతగాని మరియొకపురుషునిచే పరిగ్రహింపబడనిది యను నిషేధము వ్యర్థ[illegible]. వికసించని స్త్రీలక్షణములు కలిగిన స్త్రీ వివాహము చేసుకొనువానికి నేత్రానందమును చేయనందువలన యాజ్ఞవల్క్యునికి యువతీవివాహమే అభిమతమని చెప్పుటయు యుక్తముకాదు. కన్యను దానముచేయక భ్రూణహత్యను ప్రతిఋతువునందును పొందును అని యువతీవివాహనిషేధమును తెలుపు యాజ్ఞవల్క్యుని వచనమునకే యది విరుద్ధమగుచున్నది. నపుంసకత్వమును వ్యావర్తి చేయుటకు స్త్రీత్వముతో పరీక్షింపబడినది అనునెడ కేవలము స్త్రీత్వముతో పరీక్షింపబడినది యని గ్రహించుట పరులను వంచించుటకొరకే యగుచున్నది. నపుంసకత్వమును వ్యావర్తిచో బాహటునిచే చెప్పబడిన ధాతుపరీక్షగాని జాతకభావములతో తెలిసికొనుటగాని సాధ్యమైనది స్త్రీయొక్క స్త్రీత్వము రజస్సుయొక్కయు, స్తనములయొక్కయు ఉదయము లేనిచో తెలియ శక్యముకానియెడల గర్భాష్టమమునందే స్త్రీలకు వివాహము గావింపవలయునని చెప్పిన మనువు మున్నగువారికి స్త్రీలకు వివాహము ఉపనయనస్థానీయమని చెప్పిన విజ్ఞానయోగికి [illegible] ప్రా[illegible] మాధ్యము వాదింప శక్యముకాదు. బాల [illegible]భోగమునకు అర్హురాలు కాదను [illegible] వికసించని స్త్రీలక్షణము గలిగిన స్త్రీ వివాహము చేసుకొనువానికి నేత్రానందమును చేయదను నంశమునకును ప్రథమమున [illegible] ఉత్తరమియ్యబడియున్నది.

42-వ పేరా. యత్తు ప్రజాధర్మసంపత్త్యర్థం స్త్రీవివాహేచ్ఛోః స్త్రీశిశుదర్శనం తస్యాస్స్వీయత్వాపత్తిర్వా కేవల[illegible] హ్లాదనమాత్రం [illegible]నత్వానన్దజనకమితి తన్న సమయస్సమవర్తత ఇవైష యత్ర మాం సమనన్దయత్సుముఖి గౌతమార్పితః అయమాగృహీతకమనీయకఙ్కణస్తవ మూర్తిమానివ మహోత్సవః కరః ఇత్యుత్తరరామచరితే కవిసార్వభౌమేన భవభూతినా శిశుత్వవిశిష్టాయాస్సీతాయాః పాణిగ్రహణమాత్రేణ రామస్యానన్దోదయస్య వర్ణితత్వాత్ ప్రజాసంపత్త్యర్థం క్రియమాణస్య పిపీలికాదిబ్రహ్మపర్యన్తమనుభూయమానపరమానన్దస్య మైథునస్యాస్యానన్దానుదయాపత్తేః ప్రయత్నసామాన్యస్యాపి ప్రవృత్త్యభావాపత్తేశ్చ.

42-వ పేరా. ప్రజాధర్మసంపత్తికై స్త్రీని వివాహమాడగోరినవానికి స్త్రీశిశువును చూచుటగాని, ఆ స్త్రీశిశువునందు స్వకీయత్వము నేర్పరచుటగాని, కేవలము ఓదార్పుకొరకేగాని ఆనందహేతువుకాదు. "ఓ సుముఖీ, గౌతమునిచే అర్పింపబడిన

యేడ్పును వినివచ్చిన మామగారిచెల్లెలగు బాలవిధవను అపుత్రస్య గతిర్నాస్తి అని బలాత్కారముగ మైథునముగావించుటకు ప్రారంభించి ఆమె అనుపుతువిని యీ దుష్కార్య మేమియని చెప్పుచువచ్చిన సుందరియగు తద్భార్యను భార్యా రూపవతీ శత్రు అను సూక్తిమేరకు ముక్కు తెగగోసి ఆమెయేడ్పుచే రాబడిన గ్రుడ్డియగు దీపము చేతబట్టినదియైన తన అత్తగారియొక్క యెడమకన్నును వంధ్యా దక్షిణకాణికా అను సూక్తిచొప్పున వ్రేలితో గ్రుచ్చి పోగొట్టి ఆమె కేలియందలి దీపజ్వాలచే ఆపూరిల్లు మండగా ఉష్ణముష్ణే నశామ్యతి అని అంతటా అగ్నినిపెట్టి వెంటనే పిడికిటిదెబ్బలతో మెడబట్టి రాజభటులచే యీడ్చుకొనిపోబడినవాడై రిక్తహస్తేన నోపేయాత్ రాజానం బాలకం స్త్రియు మను సూక్తిని మనస్సులో స్మరించుచు రాజసభలో ప్రవేశించి ఇప్పుడు దుర్గ్రభమగులచే కదళీఫలమేఢ్రిచ కపిత్థ వృషణద్వయ మను సూక్తిననుసరించి తన నడుమునకట్టిన వస్త్రమును మెల్లమెల్లగా వదలించుటకు ప్రారంభించుచున్న శతశ్లోకపండితుడగు జామాతృవిదూషకునివలె అన్నివిధములైన హాస్యములకు పాత్రులయిరి. అనంతరామశాస్త్రిచేత నిర్మింపబడినదియు విశేషముగ మోహమునుకల్పించునదియు కుయుక్తిసమూహముతో సంబంధించినదియు ప్రమాణములచే దూషింపబడినదియు నగు నీ గ్రంథము వేదశాస్త్రయుక్తులతో నాచే ఖండింపబడినది ఉత్సుకులయిన పండితులు మాత్సర్యము లేక చూతురు.

గ్రంథము పూర్తి అయినది.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1952.

దర్శనానన్తరం షోడశదినాన్యతీత్యాపి గర్భధారణదర్శనేన చ షోడశదినాన్యృతురితి ద్వాదశైవ వేతి మతభేదేన వ్యవహారో వ్యర్థస్స్యాత్ అతః ఋతురత్ర సమీచీన ప్రజోత్పత్తియోగ్యకాలః న ప్రజోత్పత్తిస్వరూపయోగ్యతాయాః కాలః స చ షోడశవర్షాయా ఏవ భవతి అతః ఋతోః ప్రాగేవ కన్యోద్వాహస్యేత్యర్థకానాం వచనానాం షోడశవత్సరేభ్యోఽర్వాగిత్యర్థకల్పనం యుక్తమిత్యుక్తమపి తన్న మన్వాది సకలధర్మశాస్త్రవిరుద్ధత్వాత్ కించేతరశాస్త్రవచనేన ధర్మశాస్త్రవచనానాం విరుద్ధార్థాన్తర కల్పనస్యాత్యన్తానుచితత్వాచ్చ అన్యథా వైద్యశాస్త్రోక్తపలాండుభక్షణాదేః కామశాస్త్రప్రతిపాదితదివామైథునక్రియాదేశ్చాప్యఙ్గీకరణీయత్వాపత్తేః షోడశదినాన్యతీత్యాపి గర్భధారణస్యానన్తరామశాస్త్రిణాం స్వానుభవమాత్రప్రమాణత్వాత్ ప్రమాణాన్తరస్య మృగ్యత్వాత్ తస్యైవ బాహటీయవచనవిరుద్ధత్వాచ్చ. శ్లో॥ పద్మం సఙ్కోచమాయాతి దినేఽతీతే యథా తథా, ఋతావతీతే యోనిస్స్యాద్బీజం నైవ ప్రతీచ్ఛతి.

'46-వ పేరా. ఋతురత్ర సమీచీన ప్రజోత్పత్తికాలఏవ అని ఆరంభించి యుక్తమనునంతవరకు "పదునారుసంవత్సరములు పూర్తియైన స్త్రీ ఇరువదిసంవత్సరములు గలపురుషునితో సంగమించుటచే గర్భాశయము మార్గము, రక్తము, శుక్లము, వాయువు, హృదయము, ప్రసిద్ధముకాగా వీర్యవంతుడైన పుత్రుని కనుచున్నది. వానికి తక్కువవయస్సువారైనప్పుడు రోగముతోకూడి అల్పాయుష్షుకలదియు, దారిద్ర్యముతో కూడినదియు నగుగర్భమేర్పడుచున్నది. లేదా గర్భమే యేర్పడకపోవచ్చునని" బాహటునివచనములచే రజోదర్శనమునుండి పదహారుదినములు దాటియు గర్భధారణము కలుగుటవలన పదహారుదినములే ఋతువని పండ్రెండుదినములే ఋతువని మతభేదముచే వ్యవహరించుట వ్యర్థమగును. గాన ఋతువనగా శ్రేష్ఠమగు సంతతియేర్పడుటకు తగినకాలము. కాని కేవల ప్రజోత్పత్తికి స్వరూపయోగ్యతగల కాలముకాదు. అట్టికాలము పదహారుసంవత్సరముల వయస్సుగల స్త్రీకే యేర్పడుచున్నది. గాన ఋతువునకుముందే కన్యకు వివాహముచేయవలయుననునర్థమిచ్చు వచనములకు పదునారుసంవత్సరములకంటె నీవల వివాహముచేయవలయుననునర్థముచెప్పుట యుక్తము అని చెప్పుటయు తగదు. అది మన్వాది సకలధర్మశాస్త్రములకు విరుద్ధమైనది. ఇతరశాస్త్రవచనముచే ధర్మశాస్త్రవచనమునకు విరుద్ధమగు నర్థాంతరములను కల్పించుటయు తగదు. అట్లు కానియెడల వైద్యశాస్త్రమునందు చెప్పబడిన యుల్లిగడ్డనుతినుట మున్నగువానికి, కామశాస్త్రమునందు చెప్పబడిన పగటియందు స్త్రీపురుషకలయిక మున్నగువానిని అవశ్యమంగీకరింపవలసియుండును. పదహారుదినములుదాటియు గర్భధారణమునకు అనంతరామశాస్త్రిగారియొక్క స్వానుభవముతప్ప మరియొక్క ప్రమాణము లభించదు. అదియును బాహటుని వచనమునకు విరుద్ధము. "పగలుగడవగా యెట్లు పద్మము సంకోచమునుపొందుచున్నదో అట్లు ఋతువుగడచినపిదప యోనియును సంకోచమునుపొందుచున్నది. దీనికి పిదప అది శుక్లమును స్వీకరించదు.

మయుక్తం తద్బాలానామప్యతిహాసనీయం తస్య వేదానురోధయుక్తప్రామాణ్యాకత్వేన సర్వసంప్రతిపన్నాయాస్స్వాభిమతయువతీవివాహస్య ముఖ్యసాధనత్వేన స్వేనైవాఙ్గీకృతాయా మనుస్మృతేర్ద్వితీయాధ్యాయస్థానాం స్త్రీవివాహస్యోపనయనస్థానీయత్వప్రతిపాదకానాం వచనానామదర్శనదోషదూషితత్వాత్ స్వాభిమతయువతీవివాహస్య ముఖ్యసాధనత్వేన స్వేనైవ విశ్వసితాయా మనుస్మృతేర్ద్వితీయాధ్యాయస్థవచనదర్శనవిహీనానామనన్తరాం శాస్త్రిణామితరధర్మశాస్త్రప్రమాణపరిజ్ఞానస్య, శిక్యోత్పతనాశక్తస్య స్వర్గోత్పతనతుల్యత్వాచ్చ.

48-వ పేరా. కాన యువతియొక్క వివాహమును వేదవాక్యములతో దేనినైనను అనుసరించి ప్రామాణ్యమును పొందియున్న ధర్మశాస్త్రములయందు యెవ్విధమైన ప్రతికూలప్రమాణము చూపట్టుటలేదు అని చెప్పబడిన అయుక్తముగునంగతి బాలురకును మిక్కిలి పరిహాసింపదగియున్నది. వేదవాక్యములకు రెంటికిని ప్రామాణ్యమును పొందినదియు, అందరికిని సమ్మతమైనదియు, తన కభిమతమగు యువతీవివాహమునకు ముఖ్యసాధనముగ తనచేతనే అంగీకరింపబడినదియు నగు మనుస్మృతియొక్క ద్వితీయాధ్యాయమునందు స్త్రీవివాహమును ఉపనయనస్థానీయముగ ప్రతిపాదించు వచనములను చూడనిదోషముచే నది దూషింపబడియున్నది. తన యువతీవివాహమునకు ముఖ్యసాధనముగ తనచేతనే విశ్వసింపబడిన మనుస్మృతియొక్క ద్వితీయాధ్యాయమునందలి వచనములను చూచుటయందు అంధుడయిన అనంతరామశాస్త్రిగారు ఇతర ధర్మశాస్త్రప్రమాణముల పరిజ్ఞానము ఉట్టికెగరలేనివాడు స్వర్గమునకు ఎగురుటతో తుల్యమైనది.

49-వ పేరా. యత్తు యత్తుపరాశరస్మృతావిత్యారభ్యకథమపతితేత్యన్తం మనూక్తేః, అనుశాసనికపర్వణి భీష్మయుధిష్ఠిరసంవాదముఖేన ప్రోక్తవ్యాసోక్తేశ్చ విరోధాత్పరాశరస్మృతేస్త్యాజ్యత్వముక్తం తదయుక్తమ్ తస్య షష్ఠపరిహారేణ గళగ్రాహముత్సారితత్వాత్.

49-వ పేరా. పరాశరస్మృతౌ అని ఆరంభించి కథం అపతితా అనువరకు మనువచనమునకు అనుశాసనికపర్వమునందు భీమ యుధిష్ఠిర సంవాదముఖముచే చెప్పబడిన వ్యాసవచనమునకును విరోధముండుటవలన పరాశరస్మృతి త్యజింపదగినదని చెప్పుటయు యుక్తముకాదు. అది ఆరవపరిహారముచే మెడపట్టి తొలగింపబడినది.

50-వ పేరా. యత్తు నచేత్యారభ్య గురూన్నత్వా ప్రార్థయే ఇత్యన్తేన ధర్మశాస్త్రావిరుద్ధస్యైవాచారస్య గ్రాహ్యత్వమ్ శాస్త్రవిరోధ్యాచారస్య శాస్త్రదర్శనాత్ప్రాగాయనత్వం శ్రుతిస్మృత్యాచారాణాం యథోత్తరదౌర్బల్యాదివిచారేణేదానీమనుష్ఠీయమానస్త్ర్యవారకోర్ధ్వవివాహాచారస్య లోకన్యాయధర్మశాస్త్రవిరోధిత్వాత్తాదృశవివాహాచారః ఇతఃపరం మాభూదిత్యుక్తం తదయుక్తమ్ కన్యావివాహనిషేధబోధకానాం వచనానాం శశవిషాణసోదరత్వాత్ యువతీవివాహనిషేధకానాం కన్యావివాహవిధివిధాయకానామనన్తానాం మన్వాదిస్మృతివచనానామతీవ జాగరూకత్వాత్ ధర్మ

శాస్త్రవాసనానభిజ్ఞైరనన్తరామశాస్త్రిభిః కృతాయాః కరిష్యమాణాయాశ్చ మన్వాదివచనవ్యాఖ్యాయా అశాస్త్రత్వేన వ్యవహారాభావాచ్చ.

50-వ పేరా. నచాయని యారంభించి గుణవత్త్వాత్ప్రార్థయే అనునంత గ్రంథముచే ధర్మశాస్త్రమునకు విరుద్ధముకాని ఆచారమునే గ్రహింపదగినది అనుటయు శాస్త్రవిరుద్ధమగు ఆచారము శాస్త్రదర్శనమువలన వదులుకొనవలెననుటయు శ్రుతిస్మృత్యాచారములలో యథోత్తరము దుర్బలము మున్నగు విచారముచే నిర్ణయము అపేక్షింపబడు స్త్రీరూపశిశువుయొక్క వివాహాచారము లోకన్యాయ ధర్మశాస్త్రవిరుద్ధము గాన అట్టి వివాహాచారము ఇకమీద ఉండకూడదని అనుటయు యుక్తము కాదు. కన్యావివాహనిషేధమును బోధించు వచనములు కుందేటికొమ్ముతో సమానములు. యువతీవివాహమును నిషేధించునవియు కన్యావివాహమును విధించునవియునైన అనంతములగు మన్వాదిస్మృతివచనములు జాగరూకములై యున్నవి. ధర్మశాస్త్రవాసన తెలియని అనంతరామశాస్త్రులచే మన్వాదివచనములకు చేయబడగల దుర్వ్యాఖ్యలకు శాస్త్రమని వ్యవహారము లేదు.

51-వ పేరా. యత్తు అపిగుణహీనాయోపరుద్ధ్యాద్రజస్వలామిత్యస్య బోధాయనవచనస్య కామమామరణాత్తిష్ఠేద్గృహే కన్యర్తుమత్యపీతి మనువచననిషేధస్పష్ట ఏవేత్యుక్తం తదయుక్తమ్ అశాస్త్రీయవరనిషేధమాత్రవిధాయకమనువచనేన ఋతుమతీవివాహనిషేధమాత్రబోధకబోధాయనవచనస్య న విరోధ ఇతి కేవలకావ్యాధ్యేతౄణాం బాలానామపి సుబోధత్వాత్ తృతీయపరిహాసస్థమానసకోట్యా దత్తోత్తరత్వాచ్చ.

51-వ పేరా. గుణహీనునికైనను రజస్వల నియ్యరాదు. అను బోధాయనవచనమునకు కన్య ఋతుమతియైనను మరణమువరకు ఇంటియందే నుండవలయునను మనువచనముయొక్క నిషేధము స్పష్టమనుట తగదు. అశాస్త్రీయమగు వరునియొక్క నిషేధము విధించు మనువచనములో ఋతుమతీవివాహనిషేధమాత్రమును బోధించు బోధాయనవచనమునకును విరోధములేదని కేవల కావ్యము చదువు బాలురకునయితము సుబోధమైయున్నది. తృతీయపరిహాసమునందలి తొమ్మిదవకోటిచే ఉత్తరముకూడా నియ్యబడినది.

52-వ పేరా. యత్తు సోఽయం వైద్యనాథ ఇత్యారభ్య న విదుషాం మోదమావహన్తీత్యన్తేన వైద్యనాథదీక్షితానాం పూర్వోత్తరాసన్దర్భలేఖనాదిదోషదుష్టత్వముక్తం తదయుక్తమ్ తస్య సప్తమపరిహాసేన సార్ధచన్ద్రదానముపస్కారితత్వాత్ అజ్ఞాతాత్మదోషగజ్ఞాబీజన్యాయేనాతీవాపహాసనీయత్వాచ్చ.

52-వ పేరా. సోఽయం వైద్యనాథః అని యారంభించిన విదుషాం మోదమావహంతీ అనునంతవరకు నున్న గ్రంథముచే వైద్యనాథదీక్షితులకు పూర్వోత్తరసందర్భము లేక వ్రాయబడినట్లు దోషము చెప్పబడియున్నది. అది అయుక్తము. అది సప్తమపరిహాసముచే అర్ధచంద్రప్రయోగముతో తొలగింపబడియున్నది. తనదోషము తెలియక ఇతరమైనవానియందు దోషము చెప్పు గరిగింజసామితెవలె పరిహసింపదగియున్నది.

53-వ పేరా. యత్తు యదత్ర గ్రన్థే ఇత్యారభ్య గ్రన్థసమాప్తిపర్యన్తేన మను యాజ్ఞవల్క్యయోః ప్రాశస్త్యం సాధితం తత్కేవలమవివేకవిలసితమ్ తయోస్స్వగ్రన్థ జీవితభూతరజస్వలావివాహమూలోత్పాటనసామర్థ్యవత్త్వేన స్వాపహ్నవాదితస్వపాద నిగళతుల్యత్వాత్.

ఇత్థం చ ఖణ్డనమిదమురగభుజఙ్గతాడనమేవేతి న్యాయమనుసృత్య సమాప్త మప్యనన్తరామశాస్త్రిణాం తత్పరిశుద్ధ చ హృదయఙ్గమేష్వర్థేషు చతుర్షు తద్గ్రన్థ వాచనికోపాత్తయోర్యువతీవివాహతదనుమతిపూర్వకదానయోర్నిరస్తయోరపి వ్యఙ్గ్యత్వ మప్యాదయోః విలీనయోర్విధవావివాహగౌడద్రావిడాద్యవాన్తరవర్ణభేదసాఙ్కర్యయోర ఖణ్డితత్వేన తద్విలీనక్రమనిరూపణపూర్వకం తన్నిరాసాయ కించిదభిలషామహే.

53-వ పేరా. యదత్ర గ్రంథా యని యారంభించి గ్రంథసమాప్తివరకు మను యాజ్ఞవల్క్యులకు ప్రాశస్త్యము సాధింపబడియున్నది. అది కేవలము అవివేకవిలా సము. వారు తమ గ్రంథమునకు జీవితభూతమగు రజస్వలావివాహముయొక్క మూలమును పెకలించివేయుటయందు సామర్థ్యముకలిగినవారగుటవలన నది ఇతనికి తానుగా తన పాదమునకు సంపాదించుకొనిన సంకెలవంటిది.

చచ్చినపామును కొట్టవలదను న్యాయ మనుసరించి ఈఖండనము సమాప్తమైనను అనంతరామశాస్త్రులు తత్పరిశుద్ధము హృదయంగమములగు నాల్గువిషయములయందు అతనిగ్రంథమున వాచ్యముగనుండు యువతీవివాహ తదనుమతిపూర్వకదానములు ఖండింపబడినను వ్యంగ్యముగ దాగియుండు విధవావివాహ గౌడ ద్రావిడాది అవాంతర వర్ణభేదసాంకర్యములు ఖండింపబడనందుచే అందు ఇమిడియున్న క్రమమును నిరూ పించుచు వానిని ఖండించుటకు కొంచెము అభిలషించుచున్నాను.

54-వ పేరా. తథాహి, న వివాహవిధావుక్తం విధవావేదనం పునః ఇత్యాది నిషేధప్రసక్తివ్యావర్తనాయైవాధునానుష్ఠీయమానకన్యావివాహస్యాశాస్త్రీయత్వం తా దృశవివాహస్యాజ్ఞానబలాత్కారకృతత్వం చ ప్రథమం సాధితే చేదుత్తరత్ర వివాహవిధినా కృతమకృతమ్ అన్యథా కృతమకృతమ్ అజ్ఞానాద్బలాత్కారకృతమకృ తమ్ ఇత్యాదివాక్యైః కన్యాత్వే తదనుమతిమన్తరా వివాహితవరాణాం పతిత్వం వా తన్మరణే స్త్రీణాం వైధవ్యం వా నాస్తీతి సిద్ధాన్తీకృత్యానుపదమేవ విధవావివాహ ముఖానుభవాయోపక్రాన్తవతయుక్తమ్ ఉద్దిష్టవిధవాభావదోషదూషితనిజపతివ్యవహార విహీనానాం సర్వాసామపి నారీణాం పునర్వివాహోపపత్తేర్ద్వారత్వాత్ ఏతత్పరిహార స్యాష్టమనవమదశమైకాదశద్వాదశకోటిభిరేవ నిరస్తత్వాత్ అస్మత్తాతపాదైరారబ్ధేన మయా సమాప్తిం నీతేన క్షిప్రమేవ ముద్రియమాణేన విధవావివాహఖణ్డనాఖ్యేన గ్రన్థేన నిర్మూలితత్వాత్ బకబన్ధనప్రయాసవన్నిష్ఫలత్వాచ్చ.

54-వ పేరా. వివాహవిధియందు చెప్పుటకు విధవావివాహము చెప్పబడలేదు. అని ఇది మున్నగు నిషేధములకు ప్రసక్తి లేకచేయుటకై ఇప్పుడు అనుష్ఠింపబడు కన్యా వివాహము శాస్త్రీయముకాదు. అట్టివివాహము అజ్ఞానము చేతను, ఒరుల బలాత్కారము

చేతను చేయబడినదని ముందు సాధింపబడినది. దానికి ఉత్తరమేమంటే విధిరహితముగా చేయబడినది చేయబడనిదే మరియొకవిధముగ చేయబడినది చేయబడనిదే అజ్ఞానము చేతను అన్యుల బలాత్కారముచేతను చేయబడినది చేయబడనిదే. ఇవి మున్నగు న్యాయములతో కన్యగానున్నప్పుడు ఆమె అనుమతిలేక వివాహమాడినవరులు భర్తలగుటగాని వారు మరణించిన స్త్రీలకు వైధవ్యముగాని లేదని సిద్ధాంతముగావించి వెంటనే విధవావివాహసుఖ మనుభవించుటకై యత్నించిరి. అది యుక్తముకాదు. ఉద్దీపనవిభావము లేని బాల్యముచే హీనులయిన తమభర్తలయందు అనురాగములేని స్త్రీలకందరికిని పునర్వివాహప్రసక్తి వారింప శక్యముకాదు. ఈపరిహాసమునందలి ఎనిమిది, తొమ్మిది, పది, పదకొండు, పండ్రెండుకోటులచేతనే అవి ఖండింపబడినది. మాతండ్రిగారిచే ప్రారంభింపబడి నాచే సమాప్తిగావింపబడి శీఘ్రములో ముద్రింపబడగల విధవావివాహగ్రంథముచే నిర్మూలింపబడి యున్నది. కొంగనుకొట్టుటకు చేయు ప్రయాసవలె నిష్ఫలము.

55-వ పేరా. వేదమూలకత్వేనైవ స్మృతీనాం లోకాచారస్యచ గ్రాహ్యత్వమన్యథా త్యాజ్యత్వమేవేతి నిశ్చితం. వేదమునందేవ శ్రుత్యాదిషు బ్రాహ్మణావాన్తరభేదో నక్వాప్యుక్తత్వాదిదానీన్తనావాన్తరభేదసాఙ్కర్యం సాధయిత్వా భోజననియమమన్తరా ప్రాప్తం సర్వంచ పఙ్క్తిభోజనప్రవృత్తిమనఙ్గీకుర్యేమిత్యయత్నస్తత్కేవలమసఙ్గతమ్ బ్రహ్మణస్సకాశాదాగతా బ్రాహ్మణా ఇత్యేతన్మతానుసారేణాచణ్డాలం బ్రాహ్మణత్వస్య సిద్ధత్వేన తత్సమ్బద్ధభోజనాదిస్వీకారాపత్తేర్దుర్వారత్వాత్ శ్రుతిస్మృతీ ఇవ శిష్టాచారస్యాపి ప్రామాణ్యప్రతిపాదకమన్వాదివచనవిరుద్ధత్వాత్ ప్రధావద్రాసభవాలాదేమ్బపమాత్రోత్తరత్వసమ్ప్రాప్తార్థతుల్యత్వాచ్చ.

ఇత్థం కృతవివాహయోర్ధర్మపత్నీత్వర్ధర్మప్రతిపాదకాభ్యాం మనోర్వచస్యాస్యావ్యభిచారో తథా నిత్యం యతేయాతాం ఇత్యేతన్మనువచనాభ్యాం కరిష్యమాణవివాహయోర్వధూవరయోరవ్యభిచారప్రతిజ్ఞాత్వం జ్ఞాయత ఇత్యుపన్యస్య దాతురజ్ఞానాన్యబలాత్కారకృతత్వస్యాకృతత్వప్రతిపాదకస్య మనువచనద్వయస్య దేయపరత్వేన అర్థముపవర్ణ్య శాస్త్రీయవరాలాభే వైధవ్యకాలాత్ప్రాగపి కన్యాదాతవ్యేత్యర్థకస్యోత్కృష్టాయాభిరూపాయేత్యస్య మనువచనస్య నిషిద్ధకాలాత్ప్రాగపి దాతవ్యేత్యర్థమభిధాయ వికలాఙ్గీవివాహనిషేధబోధకస్యావ్యఙ్గాఙ్గీమిత్యేతన్మనువచనస్య కేవలమదృష్టమాత్రఫలకస్య అకరణే ప్రత్యవాయాభావవ్యవస్థాపకస్య ప్రత్యక్షస్తు పరిపూర్ణత్వభావవతీ నిషేధబోధకత్వమాపాద్య అదృష్టఫలకస్యాకరణే ప్రత్యవాయబోధకస్య ప్రాయశ్చిత్తోపసృష్టస్యాసపిణ్డా చయామాతురిత్యస్య దృష్టఫలకత్వం పరికల్ప్య స్త్రీణాం సౌన్దర్యరక్షాకాలిలోమికాత్వనిషేధబోధకస్య పూర్వవత్కేవలదృష్టమాత్రఫలకస్య నాలోమికాం నాతిలోమామిత్యేతన్మనువచనస్య సమ్యగుద్ఘాటితగుహ్యకేశలోమికాపరత్వేనార్థముపవర్ణ్య ఏవమాదీనాం సన్దర్భరహితానామప్రాకరణికానాం మనువచనానామతీవాపహాసనీయానర్థాపాదకాపూర్వపరమ్పరాజటిలవ్యాఖ్యారచనయైవ మనునా కణ్ఠోక్త్యా

నిషిద్ధరజంవతీవివాహస్య మనోరభిమతత్వం పరికల్ప్య రజంవతీవివాహోయముక్త ఇతి సిద్ధాన్తీకరణేనాత్మానం ధన్యంమన్యమానా అనన్తరామశాస్త్రిణః శ్వశురగృహమాగత్య తత్ర త్వరత్నాసనాని విహాయ (ఉచ్చస్థానేషు పూజ్యాస్త ఇతి) పరిసరపరిదృశ్యమానో న్నతగోమయశుష్కరాశిశిఖరమాస్థాయ తత్ర వృశ్చికదష్టవృషణో ఝటితి ధరణ్యామవతీర్యాభ్యఙ్గానాయ సన్నిహితసమీచీనఘుమఘుమాయితచమ్పకతైలమనాదృత్య (ఏరణ్డతైలం వాతఘ్నమితి) సమీపస్థితదీపపాత్రస్థైరణ్డతైలేన శిరస్సముత్తమో విలిప్య సన్నద్ధసుగన్ధోష్ణజలఘటాన్సర్వానప్యభ్యన్తరస్థజలనిర్గమే విక్షిప్య (ప్రవాహాభిముఖంస్నానమితి) సత్వరం బహిః ప్రధావ్య జలనిర్గమద్వారాభిముఖం శిరః ప్రసార్య అనుపదమేవ పురోనిక్షిప్తనానావిధేష్టమృష్టభక్ష్యాదికం పరిత్యజ్య (లవణం బలవర్ధనం) సర్వమన్నం లవణేనైవ సమ్మిశ్రోపభుజ్య అక్షిరోగవతీం స్వభార్యానుజామాలోక్య (అక్షిరోగే తు సంప్రాప్తే కర్ణం ఛిత్వా గుదం దహేదితి) తస్యా అతిసుకుమారిణ్యా నితమ్బే ప్రజ్వలదలాతేన నిర్దహ్య తస్యారోదనమాకర్ణ్యాగతాం శ్వశ్రూమనుజాం బాలరణ్డాం (నాపుత్రస్య గతిర్నాస్తీతి) బలాద్వ్యభ్యుపక్రమ్య తద్ఘోషం నిశమ్య కిమిదం దురాకృతమితి జల్పన్తీమాగతాం సురూపామాత్మపత్నీం (భార్యా రూపవతీ శత్రురితి) వినాసికామాకలయ్య తత్పరిదేవనాకృష్టాయాః కన్యాయా దీపహస్తాయా నిజశ్యాల్యాః (వస్త్రాశదక్షిణకాణేతి) అఙ్గుళిప్రక్షేపేణ తస్యా వామనయనమప్యపనీయ తత్కరస్థయైవ ఉత్క్షిప్తయా దీపశిఖయా వాసకుటీరేనలసాత్కృతే సతి (ఉష్ణముష్ణేన శామ్యతీతి) సర్వతో ఉపలం నిక్షిప్య అనుక్షణమేవ సముష్టిపాతం సకలగ్రామం రాజభటైర్నియ్యమానో (రిక్తహస్తేన నోపేయాద్రాజానం బాలకం స్త్రియమితి) మనసా చిన్తయన్రాజసభాం ప్రవిశ్య ఇదానీమనన్యగతికతయా (కదళీఫలమేఢ్రం చ కపిత్థవృషణద్వయమితి) నిజకటీపరిధానం శనైశ్శనైశ్శిథిలయితుముపక్రమమాణశ్శ్లోకపణ్డితజామాతృవిడమ్బక ఇవ సర్వోపహాస్యతాజన్మభూమిరభూత్. శ్లో. అనన్తరామశాస్త్రిణా వినిర్మితం విమోహకం కుయుక్తిజాలసఙ్గత ప్రమాణపఙ్క్తిదూషితమ్. విఖణ్డితం మయాధునా న వేదశాస్త్రయుక్తిభిర్విలోకయన్త్వమత్సరాస్సముత్సుకా విపశ్చితః.

సమాప్తోయం గ్రన్థః.

55-వ పేరా. స్మృతులను లోకాచారమును వేదమును మూలముగ కలిగియుండుటచే యవి అనుసరణీయములేనిచో త్యజింపవలసినదేయని నిశ్చయింపబడినచో పురుషణమునందే శ్రుతి మున్నగువానియందు బ్రాహ్మణులలో అవాంతరభేదము యెందును చెప్పబడలేదు గాన ఇప్పటి అవాంతరభేదసాంకర్యమును సాధించి భోజననియమములేక లభించినదానిని అంతయును నాలుక దురదతీరునంతవరకు తిందుమని యత్నించిరి. అది కేవల మసంగతము. బ్రహ్మవద్దనుండి వచ్చినవాడే బ్రాహ్మణులను మతమునసుసరించి చండాలురవరకు బ్రాహ్మణత్వముసిద్ధించుట తత్సంబంధముచే భోజనాదుల స్వీకరించుటయుం తప్పదు. శ్రుతి స్మృతులవలె శిష్టాచారమునకును ప్రామాణ్యమునుచెప్పు మన్వాదివచన

మునకన్నా విరుద్ధమైనది. పరుగిడెడు గాడిదతోకను పట్టుకొనినమాత్రముచే నుత్తర క్షణమున యేర్పడిన అనర్థముతో సమానమైనది.

ఇట్లు వివాహమాడిన దంపతులకు ధర్మమును ప్రతిపాదించు అన్యోన్యస్యా వ్యభిచారః తథానిత్యం యతేయాతాం అనువచనముతో వివాహమాడబోవు వధూవరులకు అవ్యభిచారప్రతిజ్ఞ యున్నట్లు తెలియుచున్నది అని ఊహన్యసించి దాతయొక్క అజ్ఞానమున అన్య బలాత్కారమువల్లగాని చేయబడినది చేయబడనట్లు తెలుపు మనువుయొక్క రెండువచనములకును, దేయపరముగ నర్థమునువర్ణించి శాస్త్రీయమగువరుడు లభించినప్పుడు విధివిహితకాలమునకంటే ముందు కన్య దానముచేయదగినది అను నర్థము కలిగిన ఉత్కృష్టాయాభిరూపాయ అను మనువచనమునకు నిషిద్ధకాలమున కంటె ముందును దానముచేయదగినదనే అర్థమును వర్ణించి వికలాంగీవివాహనిషేధమును బోధించు అవ్యంగాంగీమను కేవలదృష్టఫలము కలిగినదియు చేయనిచో ప్రత్యవాయ భావముతో కూడినవిధిని విధించునదియు నగు మనువచనమునకు ప్రత్యంగమగు స్తనపరిపూర్తిలేని స్త్రీయొక్క నిషేధముచే బోధించునని ఆరోపించి అదృష్టఫలము కలిగినది చేయనిచో ప్రత్యవాయమును బోధించు ప్రాయశ్చిత్తోపదేశము కలిగిన అసపిండా చయామాతుః అనుదానికి దృష్టఫలమును కల్పించి స్త్రీలయొక్క సౌందర్యమును పోగొట్టు అతిలోమికాత్వ అనతిలోమికాత్వ నిషేధమును బోధించు ముందువలె కేవలదృష్టఫ ముకలిగిన నాలోమికాం నాతిలోమాం అను నీ మనువచనమునకు చక్కగ మొలచిన గుహ్యదేశపు లోమములకు పరంగా అర్థమునువర్ణించి ఇవి మున్నగు సందర్భరహితములై అప్రకృతములగు మనవచనములకు మిక్కిలి అపహసింపదగిన అనర్థాపాదకమగు అపార్థపరంపరా బహుళమగు కువ్యాఖ్యరచనచేతనే మనువు కంఠరవముతో నిషేధించిన యువతీవివాహమును సతిసమ్మతమని కల్పించి యువతీవివాహము యుక్తమని సిద్ధాంతముచేయుటచే తన్ను ధన్యుడుగాభావించు అనంతరామశాస్త్రుర్లు మామగారింటికి వచ్చి అచ్చటి రత్నాసనమును వదలి ఉచ్చస్థానేషు పూజ్యస్తే అను సూక్తిచొప్పున సమీపమునకునబడు ఉన్నతమగు యెండిన పిడకకుచ్చలిపై కూర్చొని అచ్చట వృశ్చికము వృషణమును కుట్టగా వెంటనే భూమికిదిగి తలంటుకు సమీపమున నుంచబడిన శ్రేష్ఠమైన మంచిపరిమళముగల చంపకతైలమునువదలి ఆముదము వాతముకుపోగొట్టునను వైద్యోక్తిననుసరించి సమీపమందున్న దీపపాత్రలోని ఆముదముచే తలనంటుకొని సిద్ధముగానుంచబడిన సుగంధమగు వేడినీళ్లతో నిండినపాత్రలను అన్నిటినిదొర్లించి లోపలనున్న నీటికాలువలో ప్రవాహాభిముఖం స్నాన మను సూక్తి ననుసరించి శీఘ్రముగ వెలుపలకురుగిడి ఆకాలువద్వారా పారు నీటికెదురుగా శిరస్సునుంచి వెంటనే యెదుటనుంచబడిన పలువిధములగు మృష్టభక్ష్యాదులవదలి లవణం బలవర్ధన మను సూక్తి ననుసరించి ఉప్పుతో అన్నమునంతయు కలిపి భుజించి కంటిజబ్బుగలిగిన తనభార్య చెల్లెలినిచూచి అక్షిరోగేతు సంప్రాప్తే కర్ణంఛిత్వా గుదం దహేత్ అను సూక్తిచొప్పున అతి సుకుమారియగు నామెయొక్క కటిప్రదేశమును మండుకొలివిచేకాల్చి ఆమె

యేడ్పును వినివచ్చిన మామగారిచెల్లెలగు బాలవిధవను అపుత్రస్య గతిర్నాస్తి అని బలాత్కారముగ మైథునముగావించుటకు ప్రారంభించి ఆమె అనుభవిని యీ దుష్కార్య మేమియని చెప్పుచువచ్చిన సుందరియగు తన భార్యను భార్యా రూపవతీ శత్రు అను సూక్తిమేరకు ముక్కుతెగగోసి ఆమెయేడ్పుచే రాబడిన గ్రుడ్డియగు దీపము చేతబట్టినదియైన తన అత్తగారియొక్క యెడమకన్నును వంధ్యా దక్షిణకాణికా అను సూక్తిచొప్పున ప్రేలితో గ్రుచ్చి పోగొట్టి ఆమెకోలియందలి దీపజ్వాలచే ఆపూరిల్లు మండగా ఉష్ణమున్నష్టే నశామ్యతి అని అంతటా అగ్నినిపెట్టి వెంటనే పిడికిటిదెబ్బలతో మెడబట్టి రాజభటులచే ఈడ్చుకొనిపోబడినవాడై రిక్తహస్తేన నోపేయాత్ రాజానం బాలకంస్త్రియమను సూక్తిని మనస్సులోస్మరించుచు రాజసభలో ప్రవేశించి ఇప్పుడు దుర్లభమగుటచే కదళీఫలమేఢ్రిచ కపిత్థ వృషణద్వయ మను సూక్తిననుసరించి తన నడుమునకట్టిన వస్త్రమును మెల్లమెల్లగా వదలించుటకు ప్రారంభించుచున్న శతశ్లోకపండితుడగు జామాతృవిదూషకునివలె అన్నివిధములైన హాస్యములకు పాత్రులయిరి. అనంతరామశాస్త్రిచేత నిర్మింపబడినదియు విశేషముగ వ్యామోహమును కల్పించునదియు కుయుక్తి సమూహముతో సంబంధించినదియు ప్రమాణములచే దూషింపబడినదియు నగు నీ గ్రంథము వేదశాస్త్రయుక్తులతో నాచే ఖండింపబడినది ఉత్సుకులయిన పండితులు మాత్సర్యములేక చూడుడు.

గ్రంథము పూర్తి అయినది.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1952.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 4 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 8 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మాయజ్ఞము | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 4 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 5 | 0 |
| ఋగ్వేదసంహిత మొదటిఅష్టకము, టీకాతాత్పర్యసహితము, పాతప్రతి | | 5 | 0 |
| కేశవాదిచతుర్వింశతి నామభాష్యం | ... | 0 | 4 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులవి) | ... | 0 | 4 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము; మంత్రప్రశ్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 1 | 0 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| బ్రహ్మాయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| ద్రావిడసంధ్యావందనము | ... | 0 | 4 |
| ద్రావిడశ్రాద్ధప్రయోగము (షట్పిండవిధానము) | ... | 1 | 0 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 1 | 0 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 3 |
| మంత్రప్రశ్నములు, సస్వరము (ఏకాగ్నికాండ) | ... | 0 | 6 |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 3 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 6 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 1 | 0 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు | ... | 0 | 12 |
| యజుర్వేదకథాసంగ్రహము, వచనము | ... | 0 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 5 | 0 |
| రుద్రము, నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 4 |
| వేదములోని వ్యవసాయము | ... | 0 | 2 |
| వేదమాహాత్మ్యము, తెనుగువచనము | ... | 0 | 2 |
| వైదికమతచరిత్రము, గోపరాజు వైకుంఠరావుగారిది | ... | 3 | 8 |
| వ్రతచూడామణి, సంస్కృతము | ... | 3 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 1 | 0 |
| „ ద్వితీయభాగము | ... | 2 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు ... | 0 | 8 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 8 |
| సత్యనారాయణవ్రతకల్పము, తాత్పర్యసహితము ... | 0 | 8 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 3 |

## జ్యోతిషగ్రంథములు

| | | |
|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 8 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము ... | 1 | 0 |
| కాలామృతము, సవ్యాఖ్యాసాంధ్రతాత్పర్యము ... | 2 | 8 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| గణకానందము ... | 1 | 8 |
| గౌళిశాస్త్రము, తెలుగువచనము ... | 0 | 4 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము ... | 0 | 8 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము ... | 1 | 0 |
| జైమినిసూత్రములు ... | 1 | 8 |
| నక్షత్రచూడామణి, సంస్కృతము ... | 0 | 8 |
| పుష్పబంధము ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము ... | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 5 | 0 |
| భృగుసూత్రములు, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 8 |
| భావార్థచంద్రిక ,, ... | 1 | 0 |
| మయవాస్తువు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| ముహూర్తమార్తాండము ... | 2 | 0 |
| రెట్టమకశాస్త్రము, తాత్పర్యసహితము ... | 1 | 8 |
| లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము ... | 1 | 8 |
| వనమాల (వర్షఫలి) ,, ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 6 |
| వృద్ధపారాశర్యము ,, ... | 1 | 0 |
| శకునశాస్త్రము, టీక (శిఖినరసింహశతకము) ... | 0 | 8 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్న గ్రంథమునకు తెనుగు ... | 0 | 4 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1